# మహాబలిపురంలోని శిల్పఖండాలు



1. గజయూధం



2. వానరసంసారం

—ఛాయాచిత్రకారుడు శ్రీ దశిక రామలింగేశ్వరరావు.

వ్యాఖ్యలు, విమర్శలు :

# కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

కాంగ్రెస్ కార్యవర్గం ఢిల్లీలో సమావేశమై కాంగ్రెస్ సంస్థ నిర్మాణానికి సంబంధించిన కొన్ని ముఖ్య సమస్యలనూ, పరిపాలనావిధానంలో భూమి శిస్తు విధాన సంస్కరణ, ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమాలు, భాషారాష్ట్రాలను గురించి చర్చించింది. తిరిగి జూన్ మాసాంతంలో సమావేశమై ప్లానింగ్ కమిషన్ పూర్తి నివేదికను చర్చించడానికీ, అఖిలిండియా కాంగ్రెస్ కమిటీని ఇండోర్‌లో ఆగస్టు 30 వ తేదీ సమావేశపరచడానికీ, ఈ సంవత్సరాంతంలో కాంగ్రెస్ సర్వసభ్యసమావేశం జరగడానికి నిర్ణంచబడింది.

భాషారాష్ట్రాలను గురించి కార్యవర్గం ఎట్టి నిర్ణయానికీ రాలేదు కాని ప్రధాని పండిట్ నెహ్రూ ఈ సమస్యని ఎటో అటు త్వరలో నిర్ణయించడం అవసరమని భావిస్తున్నట్లు తెలుస్తున్నది. బొంబాయి నగర భవిష్యన్నిర్ణయంకోసం త్వరలోనే సరిహద్దు నిర్ణాయక సంఘ మొకటి నియమింపబడగలదని శ్రీ హీరే బొంబాయిలో ప్రకటించారు. అంటే భాషారాష్ట్రాలను గురించి ఎట్టి నిర్ణయం చెయ్యకుండానే ముందుగా బొంబాయిపట్టణాన్ని విడగొట్టడం జరగవచ్చును. అవకాశం ఉన్నప్పుడూ లేనప్పుడూ కూడా మతవిద్వేషాలతో జతపరిచి భాషారాష్ట్రవాదాన్ని కాంగ్రెస్ నాయకులందరూ గర్హించడాన్నిబట్టి ఆంధ్రులు వాంఛిస్తున్న రీతిని భాషా రాష్ట్రాల నిర్ణయం జరగబోదని భావించవలసివస్తున్నది. అయితే అటో ఇటో త్వరలో తేల్చినట్లయితే అనవసర ఆందోళనలకు ప్రచారాలకు అనువివ్వ నవసరం ఉండదు.

## ఆంధ్రరాష్ట్రోద్యమం :

స్వామి సీతారాంగారి ఉపవాసదీక్షు జూన్ 4 వ తేదీని ప్రారంభించబడిన సత్యాగ్రహోద్యమాలు భాషారాష్ట్రవాదులకుగాని, ప్రభుత్వానికిగాని కాంగ్రెస్ అధిష్ఠానవర్గానికిగాని ఇదివరలో సహాయకారి కాలేదు; ఇప్పుడూ ప్రయోజనరహితంగానే ఉన్నాయి. క్లబ్ ఉపన్యాసాలు, గ్రామభజనలు, పల్లెలలో బోడిలతగవులమాదిరిగా ఇంతవరకూ నిర్వహించబడినందువల్ల రాష్ట్రోద్యమం అప్రతిష్ఠపాలయింది. ఇప్పటికయినా అర్థంలేని ఆవేశాలను రెచ్చగొట్టేబదులు నాయకులు పటిష్ఠమైన రాజకీయోద్యమంగా రూపొందించినట్లయితే, ఉత్తమాదర్శాలుగల ఉద్యమాలకువలె గౌరవ ప్రతిష్ఠలను ఈ ఉద్యమానికి తేగలిగినట్లయితే ఇప్పటికైనా ఉద్యమం ఫలించగల. అవకాశం ఉంది. కేంద్ర కాంగ్రెస్ నాయకులుగాని కేంద్ర ప్రభుత్వంగాని మన ఉద్యమాన్ని గౌరవించి ఆదరించాలంటే, నిరాకరించడానికి వారికి వెరపుగలగాలంటే ముందుగా హేళనకు పాత్రం కాని విధంగా రాష్ట్ర నిర్మాణానికి అనుకూలమైన ప్రజాభిప్రాయాన్ని ఆంధ్రదేశంలో కలిగించాలి. న్యాయధర్మాలు మన పక్షాన ఉన్నప్పటికీ ఉద్యమం అసమర్థుల వాత బడినట్లయితే ధర్మహాని సంభవించడం లోకానుభవమే. చిత్రమేమిటంటే ఆంధ్రదేశంలో సర్వరాజకీయ పక్షాలూ రాష్ట్రోద్యమానికి సుముఖంగానే ఉన్నాయి. ప్రజలలోని సర్వవర్గాలవారూ ప్రత్యేకాంధ్ర రాష్ట్రానికి సుముఖులే. కాని రాష్ట్రోద్యమానికి సరియైన స్వరూపం సిద్ధించలేదు. 'చెన్నపట్నం పూర్తిగా మనదే' వీటి అవకతవకలకు తావులేని సక్రమమైన ఉద్యమం రూపొందించాలంటే వ్యవధిపట్టుతుంది. అట్టి ఉద్యమాన్ని రూపొందించడానికీ, ఉద్యమానికి ప్రజాభిప్రాయమనే సహజబలాన్ని చేకూర్చడానికీ నాయకవర్గం కృషిచేయవలసిఉంది.

## భూమిశిస్తు సంస్కరణలు:

జమీందారీలరద్దు, ఇతర భూమిశిస్తు సంస్కరణలను గురించి కేంద్ర కాంగ్రెస్ కార్యవర్గం చర్చించింది. జమీందారీలను రద్దుచెయ్యని రాష్ట్రాలలో నిర్ణీతకాలంలోగా రద్దు చెయ్యబడాలని కార్యవర్గం అభిప్రాయపడింది. ఇతర శిస్తు సంస్కరణల అవసరాన్ని కార్యవర్గం గుర్తించింది. సహకార విధానంద్వారా వ్యవసాయం నెరపి ఆహారవస్తూత్పత్తిని వృద్ధిచేసే అవకాశాలను కూడా కార్యవర్గం చర్చించింది. ప్రభుత్వాలు ఈ కార్యక్రమాలకు తోడ్పడాలని కార్యవర్గ సభ్యులు అభిప్రాయపడ్డారు.

ఈవారం ముఖ్యవిషయాలు


ముఖ-చిత్రం : ప్రతిభావారి 'చిన్నకోడలు' లో కుమారి.

| | |
|---|---|
| వ్యాఖ్యలు విమర్శలు | 1 |
| కథలు. | |
| రిక్షావాడు— | 4 |
| అత్తయ్య— | 8 |
| చదరంగం— | 16 |
| జీవగర్రలు— | 17 |
| కోర్టుకురాని సాక్షులు | 18 |
| బొమ్మరిల్లు— | 23 |
| పంచతంత్రం— | 24 |
| సినీమా— | 40 |

## కాంగ్రెస్ సంఘాలు:

ఆలిండియా కాంగ్రెస్ కమిటీ, రాష్ట్ర కమిటీలు, పార్లమెంటరీ, రాష్ట్రశాసన సభల పార్టీలమధ్య సహకారం సాధించడానికి లయజాన్ ఆఫీసర్లను నియమించే విషయం చర్చించబడింది. అంటే పార్టీ వ్యవహారాలపై అధిష్ఠానవర్గం అజమాయిషీ అధికమౌతుందన్నమాట. కాంగ్రెస్ సంస్థలో అనైక్యతవల్ల సంభవించే అనర్థకం ఈ యత్నంవల్ల కొంత నివారించబడగల అవకాశం కలుగుతున్నది. శాసనసభల పార్టీలపై కూడా సమానమైన అజమాయిషీ ఏర్పడితే రాష్ట్రకమిటీలకూ రాష్ట్ర శాసన సభల పార్టీలకూ మధ్య ఇదివరలో సాధ్యపడని సహకారం ఇప్పుడు లభించే అవకాశం ఉంటుంది.

పరిపాలనలోకాని పార్టీలలోకాని అధికారం కేంద్రీకృతం కావడంవల్ల ప్రయోజనం ఎంత ఉంటుందో హానికూడా అంతే సంభవించడాని కెల్లప్పుడూ అవకాశం ఉంటుంది. ప్రాంతీయావసరాలను గమనించి, ఎంతవరకూ కేంద్రవర్గ అధిపత్యం ఉండాలో జాగ్రత్తపడినట్లయితే కొంత వరకూ దోషం నివారణ కావచ్చును.

## విద్యాసౌకర్యాలు:

నాన్‌గెజెటెడ్ ఆఫీసర్లు, రు 300 కు మించని మాసవేతనం తీసుకునే లోకల్ బోర్డ్ ఉద్యోగులు, ఎయిడెడ్ పాఠశాలల ఉపాధ్యాయుల బిడ్డలకు మూడోఫారం వరకు ఉచిత విద్య, ఆపైన స్కూల్ ఫైనల్ వరకూ జీతాలలో సగం మినహాయింపు సౌకర్యాలను ఇస్తూ మద్రాసు ప్రభుత్వం ఉత్తరువుచేసింది. ఈ ఉత్తరువు జూన్ 1952 నుండి అమలులోకి వస్తుంది.

ఈ సదుపాయాల మూలంగా ఎయిడెడ్ పాఠశాలలకు సంభవించే రాబడిలోపాన్ని పూర్తిగానూ లోకల్‌బోర్డ్ స్కూళ్లకు సంభవించే రాబడి లోపాన్ని సగానికీ ప్రభుత్వం భర్తీచేస్తుంది. మిగిలిన సగాన్ని లోకల్‌బోర్డులే భరించాలి.

లోకల్ బోర్డులీ నష్టాన్ని భరించలేని పక్షంలో ఇతర విద్యార్థుల జీతాల్ని పెంచదల్చుకొంటే ప్రభుత్వం నివారించజాలదని ఇదివరలో ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు చెప్పారు. ప్రభుత్వోద్యోగులకు ఖర్చు భారాన్ని తగ్గించడంకోసం ఇతరులపై ఆ భారాన్ని మోపడం న్యాయంకాదు. ప్రభుత్వపు ఉత్తరువుఫలితంగా సంభవించిన ఈనష్టంకోసం లోకల్‌బోర్డులు ఇట్టి చర్య తీసుకోదలచినట్లయితే నివారించడం ప్రభుత్వ కర్తవ్యం.

అసలే - రాబడి చాలక అనేక ముఖ్య కార్యక్రమాలను విడనాడుకుంటున్న లోకల్‌బోర్డులపై ఇట్టి భారాన్ని వెయ్యడంకూడా ఉచితమనిపించడంలేదు. ప్రాథమిక విద్యావ్యాప్తికి లోకల్‌బోర్డులు

(46-వ పేజీ చూడండి)

# రిక్షావాడు

ఇప్పుడే ఆలిండియా రేడియో స్టేషను భవనంనుంచి బైటకు వచ్చాను. ఎండ తీక్షణంగా ఉంది. మే నెల. మధ్యాహ్నం ఒంటిగంటన్నరయింది. పూర్తిగా కళ్లు విప్పి పైకి చూడలేనంత దారుణంగావుంది ఎండ. ఇంత ఎండలో నడవటం కష్టమని ఒక రిక్షా కట్టించుకుని మరీ పోదామనుకున్నాను. హాండ్ బాగ్ తీసి చూసుకున్నా. కొన్ని చిల్లరడబ్బులు, ఒక 15 రూపాయల చెక్కు చేతికి తగిలాయి. అది, ఆలిండియా రేడియోవారు నాపేర వ్రాసియిచ్చింది. ఆ చెక్కును బయటికి తీసి ఒకసారి చూసుకున్నా. దానిని చూడగానే ఒక విధమైన సంతృప్తితో నా మనసు నిండింది. మళ్ళీ ఇంకోకసారి దానిని తృప్తిగా చూసి హాండ్ బాగ్ లో పెట్టుకున్నాను. అది నా కష్టానికి ఫలం అనుకున్నా. కాని నిజానికి నేనేం కష్టపడ్డాను? 15 నిముషాలుపట్టే ఒక నాటికలో 4, 5 వాక్యాలు మాట్లాడాను. అంతేనా! పోనీలే, ఏదైతేనేం. 15 రూపాయలు నా చేతికొచ్చాయి. అంతే చాలు. ఇలా ఆలోచించుకుంటూ అటూ ఇటూ చూశాను. అప్పుడే ఒక ఖాళీ రిక్షా అటునుంచి వస్తోంది. చెయ్యూపాను. రిక్షా దగ్గరకొచ్చి ఆగింది.

ఆ రిక్షా లాగేవాడికి సుమారు 60 సంవత్సరాలుంటాయి. ఒళ్ళూ, ముఖం బాగా ముడతలుపడిపోయి ఉన్నాయి. నరాలు కనపడుతూ, బక్కగా ఉన్నాడు. కాళ్ళకు బాగా పాతబడిపోయిన చెప్పుల్ని తాళ్లతో కట్టుకున్నాడు. వాడు తొడుక్కున్న చొక్కా, వెనక ఒక ప్రక్క సగానికిపైగా చిరిగిపోయింది. అది ఒంటి నట్టిపెట్టుకొని ఉండేందుకు ముందు భాగం ఒక్కటే ఆస్కారంగా ఉంది. ముందుభాగంలో బొత్తాలు ఏమీ లేవు. వెనకాల పూర్తిగా లేకపోవటం మూలాన్ని చొక్కా ముందుకు వేళ్లాడుతోంది. ఒక పంచె (గుడ్డ అంటే బాగుంటుంది) మోకాళ్ళపైకి కట్టుకున్నాడు. నెత్తిమీద ఒక చిరుగుటోపి. ఇదీ వాడి వాలకం.

"బస్ స్టాప్ కి పోవాలి. ఏం తీసుకుంటావు?" అని అడిగాను.

"అరణాలిప్పించండి"

"అదేవిటయ్యా అలా అడుగుతావు? ఇక్కడున్న బస్ స్టాప్ కి, ఒక్క మనిషికి అరణాలా! నేనేమన్నా కొత్తదాన్ని అనుకున్నావేమో! రోజూ వస్తూపోతూ ఉంటాను. మూడణాలు ఇస్తాను. వస్తేరా, లేకపోతే లేదు."

"ఎత్తెక్కాలమ్మా. ఎండలో నడవాలి. అయిదణా లిప్పించండి."

"బాగుంది. ఎండలో నడవకపోతే డబ్బులెట్లా వస్తాయి? ఆఖరుమాట పావలా ఇస్తాను. వస్తావా?"

"మీ దయ. కట్టంసూశారు కారు. ఎక్కండి."

రిక్షాలో ఎక్కి కూర్చున్నాను రిక్షా నడుస్తోంది. వాడు మొదట గబగబా పరుగెడదామని ప్రయత్నించాడు. కాని నాలుగడుగులు వేసేటప్పటికి ఆయాసం వచ్చి నెమ్మదిగా నడవటం ప్రారంభించాడు. ఒంటినిండా చెమటలు కారుతున్నాయి.

"అయితే అక్కడేంసేత్తారు అమ్మాయిగోరూ? రోజూ శానామంది వచ్చిపోతుండారు. మీరు పదవాడేరా?" అన్నాడు.

"లేదు. నాకు పాటపాడటం చేతకాదు. ఒక నాటకంలో మాట్లాడాను. అక్కడ రోజూ నాటకాలు, పాటలు, గానసభలు, హరికథలు, అన్నీ జరుగుతుంటాయి."

"అయితే నాకు తెలకడుగుతాను. అయన్నీ రోజూ ఎందుకేత్తారండి? రోజూ ఇనటానికి ఎవరికి తీరుద్ది?"

వాడి అమాయకత్వానికి నాకు నవ్వు వచ్చింది. "ఎందుకు తీరుబడి ఉండదు? రోజూ కావలసినంతమంది విని ఆనందిస్తారు" అన్నాను.

"మరి గత్తే ఈ టన్నింటికి డబ్బుండాలి గదా! అదెవరిత్తారంట?"

"వాళ్లు చాలా డబ్బున్నవాళ్ళులే." అన్నా వాడింక ఏమిచెప్పినా గ్రహించుకోలేడని.

"అట్టానా, అయితే సెప్పినందుకు ఆళ్లు మీకుకూడా డబ్బిత్తారా?"

"ఆ, ఇస్తారు. ఇవాళ నేను ఒక నాటకంలో నాలుగయిదు మాటలు మాట్లాడాను. 15 రూపాయలు ఇచ్చారు" అన్నాను కొంచెం గర్వంగా.

"అయ్య బాబోయ్, పదిహేను రూపాయలే! నాలుగయిదు మాటలకి అంతెందుకిచ్చారు? ఆళ్ళు ఎర్రోళ్ళలాగున్నారే! మాకు ఇంతెండలో, వానలో రోజల్లా కట్టపడ్డా, దినానికి రొండు రూపాయలొత్తానికి బెమ్మాండమవుద్ది. అయితే అమ్మాయిగోరూ, మా బోటోళ్లు కూడా అక్కడ మాటాడొచ్చా?"

"నువ్వేం మాట్లాడగలవు?" అన్నాను వాడి తెలివితక్కువతనానికి నవ్వుకొని.

"మీరెట్టా మాటాడారు? ఆరు సెప్పిందే మీరన్నారా? మీ కిట్టవయింది మీరు సెప్పారా?"

"నేనుమాత్రం వాళ్లు చెప్పిందే మాట్లాడాను. కొందరు వాళ్ల కిష్టమైంది కూడ చెప్తారు. ఒకవేళ నిన్ను నాటకంలోకి పిలుస్తారనుకో. నువ్వు మాట్లాడగలవా?" అన్నాను తమాషాగా.

"అంత అద్దుట్టవా అమ్మా, ముసలితనంలో ఈ రిచ్చా నాగనేక నాపాణాలు పోతుండయి. రొండుమైళ్ళు లాగినా అద్దరూపాయి డబ్బులు ఏ అయ్యా ఇయ్యరు. అక్కడ ఎంచక్కా రొండు మూడు మాటలు మాటాడితే పదేనురూపాయలొత్తాయి. ఎంత సుకం! కాని మా కరమం అమ్మా. మీరయితే సదువుకున్నా మారోజులు కొమట్టి ఆరేటి సెప్తే అదిఅనగల్రు. మాకెట్టా సేతనవుద్ది?"

"నీ కింట్లో పిల్లలెవరూ లేరా? ఇంత ముసిలాడివి నువ్వెందుకింకా కష్టపడతావు?"

"ఒ కొడుకున్నాడమ్మా. ఆడి కప్పుడే ఇద్దరు పిల్లలు, పెళ్ళాంవూ. ఆడి సంపాదన ఆడికే సాలదు. నాకేం పెడతాడు? మా ముసిల్దీ మంచంమీంచి నెగనేదు. ఖాయిలా మడిసి. ఇక నే కట్టపడకండా ఎట్టా జరుగుద్ది?"

"నీకొడుకు నీ మనవలకి చదువు చెప్పిస్తున్నాడా?"

"అమ్మాయిగోరూ, పిల్లా, పెద్దా ఇంటిల్లపాదీ దినాం కట్టపడితే ఒక్క పూటైనా కడుపునిండా తినేందుకు సాలదు. ఇక సదువు లెట్టాగొత్తాయి? పాతకాలూ అటికి డబ్బుండాలి గదా!"

ఎండ చాలాతీక్షణంగా ఉంది. రిక్షాలో కూచున్నా తల

శ్రీమతి రుక్మిణీ గోపాల్

[illegible]ంది. కబుర్ల సందడిలో వాడి పరుగు మానేసి నెమ్మదిగా నడవటం మొదలెట్టాడు. అయినా వాడి ఒళ్ళంతా చెమటతో తడిసి ముద్ద యింది. మధ్యమధ్య కొంచెం రొప్పు తున్నాడు. ఇంతలో బస్‌కి టైమ్ అయిపో యిందని జ్ఞాపకం వచ్చింది. ఇంకా చాలా దూరం పోవాలి. ఆ బస్ దాటిపోతే అక్కడ ఎండలో బడి గంటసేపు కూచోవాలి. ఎవడు కూర్చుంటాడు! వాడిని కొంచెం తొందర పెట్టాను. వాడు మళ్ళీ కొద్దిగా పరుగు ప్రారంభించాడు.



బస్‌స్టాప్ దగ్గరకు వచ్చేసింది. ఇంటికి ఏమైనా పళ్ళు కొనుక్కునిపోదామని, అక్కడే ఒక పళ్ళదుకాణం ఉంటే రిక్షా ఆపమన్నాను. నేనుదిగి పళ్ళు బేరం చేస్తున్నాను. వాడు నేను కొంటున్న పళ్ళవంక ఆశగా చూస్తూ నిలబడ్డాడు.

ఒక రూపాయి పళ్లు కొని వచ్చి రిక్షాలో కూర్చున్నా. ఇంతలోనే ఎక్కడనుంచివచ్చాడో, ఒక ఎర్రటోపీ ప్రత్యక్షమైంది. "ఏయ్ నడిరోడ్డుమీద రిక్షా ఆపకూడదని తెలీదూ? నీ పేరేవిటి?" అన్నాడు జేబులోంచి నోట్‌బుక్, పెన్సిల్ తీసుకుంటూ.

రిక్షావాలా ఒక సలాంకొట్టి, బెదురుచూపులు చూస్తూ "ఇప్పుడే ఈరు పళ్లుకొంటానికి దిగేరు బాబూ, ఈపాలికి చెమించండి." అన్నాడు.

"క్షమించటంలేదు, గిమించటంలేదు. రోడ్డుకు అడ్డంగా పెడితే వచ్చేపోయేవాటికి అడ్డమని తెలీదు?"

"రోడ్డుకు పక్కగానే పెట్టాను బాబూ. బుద్ధి గడ్డితింది. ఇంకెప్పుడూ ఇట్టాంటి పని సెయ్యను."

"ఏయ్ అదంతా పనికిరాదు. అందరూ ఇలాగే అంటారు. ముందు నీపేరు చెప్పు" అన్నాడు కరుగ్గా. రిక్షావాలా బరువుగా పేరు, అదీ చెప్పాడు. పోలీసు వ్రాసుకుని "రేపు ఉదయం పది గంటలకు స్టేషన్కి వచ్చి కనపడు" అంటూ దర్జాగా వెళ్ళిపోయాడు.

రిక్షావాలా నావంక జాలిగా చూశాడు. నాకు వాడిమీద చాలా జాలివేసింది. నేను ఈరోజు ఏమీ కష్టపడకుండానే 15 రూపాయలు కళ్ళజూశాను. వాడు రోజంతా ఎండల్లో మాడి కష్టపడ్డా రెండు రూపా

(47-వ పేజీ చూడండి)

సీరియల్ నవల

# రెండు మహా నగరాలు

చార్లెస్ డికెన్స్

## 15

ఫ్రెంచి చక్రవర్తి దర్బారు దిగ్గంతుల్లోని ఒకానొక దొడ్డ ప్రభువు పారిస్‌లోని తన విలాస మందిరంలో మకాంచేసివున్నారు. పవిత్రాతిపవిత్రములైన ఆ మందిరపు లోపలి గదులలో ఆయన వేంచేసివుంటే, వారిని సేవించవచ్చిన భక్తబృందమంతా చుట్టూ బయటిగదుల్లో పడిగాపులు పడున్నారు. దొడ్డప్రభువు చాకొలెట్ పానీయం స్వీకరించబోతున్నారు. ఆయన సునాయాసంగా, ఎన్నెన్ని పదార్థాలనైనా ఇట్టే మింగివేయగలరు. ఆయన ఫ్రాన్సుదేశాన్ని యావత్తూ త్వరితగతిని మింగిపారేస్తున్నాడని, కొందరు కుళ్లుమోతువాళ్ళు అనటం కూడా కద్దు. కాని, ప్రాతఃకాలంలో, ఆయన చాకొలెట్ త్రాగాలంటే, వంటవాడుకాక, బలసంపన్నులైన నలుగురు మనుషులు సాయంచేస్తేనేగాని, ఆ పానీయం ఆయన గొంతులోకి దిగజారదు.

అవును, నలుగురూ వుండితీరవలసిందే. ఆ నలుగురూ కూడా పటాటోపంగా అలంకరించుకుని వుండాలి. ఆ నలుగురిలోనూ పెద్ద ఉజ్జీఅయిన మురామేస్త్రీ: ఒకటికి రెండు, బంగారు జేబు గడియారాలు అలంకరించుకోవాలి. అది ప్రభువుగారు స్థాపించిన సాంప్రదాయం కావటంచేత, ప్రభువుగారి పద్ధతిలో తనూ గడియారద్వయం అలంకరించుకుంటేగాని హోదాకు సరిపోయినట్టుగా వుండదు. ఆ లాంఛనాలతో అలంకరించుకుని వుంటేగాని, సుఖావహమైన ఆ పానీయాన్ని ప్రభువుగారి పెదవులకు అందించే అర్హత యేర్పడదు. ఒక సేవకుడు పానపాత్రను ప్రభువర్యుల సన్నిధికి చేకొనివచ్చాడు. వేరొక సేవకుడు బంగారు శలాకతో చక్కగా నురుగుకట్టేవరకూ చిలికి అక్కడ వుంచాడు. మూడవసేవకుడు చేరుమాల అందించాడు. ఆపైన జములు గడియారాల సేవకాగ్రణి పానపాత్రను ప్రభువుల పెదవులకు అందించాడు. ఆ నలుగురూ అలా వుండితీరవలసిందే. ఆ నలుగురిలో యేఒక్కణ్ణి తగ్గించినా ప్రభువుగారి వంశమర్యాదకే భంగంవాటిల్లిపోతుంది. నిజంగా యిద్దరి సహాయంతోనే చాకొలెట్ సేవించవలసిన దుస్థితే సంభవిస్తే ఆ అగౌరవాన్ని భరించలేక ప్రభువు స్వయంగా చచ్చిపోతారు.

ప్రభువు రాత్రి వేళ విందుగుడిచేవేళ నటనటీ గాయక విలాసములూ, వాద్యసంఘోషణములూ మిన్నుముట్టుతూవుంటై. ప్రభువు కళాప్రియుడు; ఫ్రాన్సుయొక్క అవసరానవసరాల ఘోష ఆయన్ను ఈషణ్మాత్రమైనా కదలించలేకపోయినా, కళాలాలిత్యాలంటే కరగి నీరౌతారు. అలాంటి మహామహుణ్ణి కన్న ఫ్రాన్సుదేశం, నిజంగా, ధన్య—ఫ్రాన్సుమాటేమిటి అలాంటి ప్రబుద్ధుణ్ణికన్న యేదేశం మాత్రం!—దేశాన్ని మొత్తంగా తాకట్టుపెడితే పెట్టాడుగాక, రంగేలా స్టూవర్టు ప్రభువురోజుల్లో ఇంగ్లండు కీర్తిమాత్రం మిన్నుముట్టలేదూ!

పబ్లికు వ్యవహారాల విషయంలో ప్రభువుగారికి ఒక మహత్తరమైన అభిప్రాయం వుంది—ఏది ఎలా నడుస్తుంటే దాన్ని అలా నడవనియ్యాలి; ఇక వ్యక్తిగతంగా తనకు సంబంధించిన విషయాల్లోకూడా అంతకంటే ఉత్తమోత్తమమైన మరో అభిప్రాయం వుంది: ప్రతివ్యవహారం తనకు వీలుగా వుండేటట్టూ, తన అధికారసంపదలు వృద్ధిపొందేటట్టూ నడవాలి. అన్నిటినీ తలదన్నిన అత్యంత పరమోత్తమాభిప్రాయం, మూడవది: ఈ ప్రపంచం యావత్తూ తన ఆనందవిలాసాలకొరకు సృష్టింపబడి వున్నదనుకోవటం. 'ఈప్రపంచమూ అందలి యావత్తునిధినిక్షేపములూ, నావి'—ఇది ప్రభువుల శాసనం.

అయినా, ఇటీవలగా, ప్రభువుగారి ప్రయివేటు, పబ్లికు వ్యవహారాల్లో కొన్ని చిన్ని చిన్ని లుగాడీ చిరాకులు కనుపించుతూనే వున్నయ్. అంచేత, ఈ రెండు రకాల వ్యవహారాలలోనూ కూడా శ్రీవారు ఒక మహాభూస్వామితో పొత్తుకలుపుకున్నారు. పబ్లికు ఆర్థికవ్యవహారాలు తమకు ఎలాగూ అంకెకు వచ్చేవికావు గనక వాటిని యెలాగూ మరొకరికి వప్పగింత చెయ్యవలసేవుంది. ఇక రెండోది, ప్రయివేటు ఆర్థిక వ్యవహారాల విషయం; తమ వంశం తరాల తరబడి విలాస విభ్రమాలలో మునిగితేలుతూ, ఉన్నదీ మన్నదీ కరారావుడిఅయిపోతున్న కారణంగానూ, ఆ మహాభూస్వామి బాగా డబ్బున్న సంపన్నుడు కావటంచేతనూ, ఆ వ్యవహారమంతా ఆ భూస్వామికే వప్పగింత చేసి పారేస్తే పోతుందనుకున్నారు. అందుకుగానూ, కాన్వెంటులో వున్న తన చెల్లెల్ని, ముసుగు నెత్తిమీది కెక్కకపూర్వమే తొందరపడి యివతలికి లాక్కొచ్చి, వంశగౌరవాలు వగైరా ఛాందసాలు పాటించకుండా ఆమహాభూస్వామి కిచ్చి కన్యాదానం చేశారు. ఇప్పుడు ఆ భూస్వామివర్యుడు పచ్చలబెత్తం చేత్తో పుచ్చుకుని, బయటిగదిలో పడిగాపులుపడున్న భక్తకోటి ప్రాణాచారాలు స్వీకరించుతూ ఉల్లాసంగా వున్నారు. తతిమ్మా మానవజాతియావత్తూ ఆయన పాదధూళి శిరోధార్యంగా, అలా ఆనతులుపచరించుతున్నా—ప్రభువుగారి రక్తబంధువులు మాత్రం—తన భార్యా దేవీలూ, సమగ్రనిరసనతో పురుగుక్రింద చూస్తూ వుంటారు.

భూస్వామి ఇంత బాగా కలవాడు. ఆయన శాలలో రెండున్నర డజన్లవరకూ గుర్రాలున్నయ్. ఆయన దేవిడీలో రెండు డజన్ల మగసేవకులు అచ్చోసిన ఆంబోతుల్లా తిరుగుతూవుంటారు. ఆయన భార్యకు ప్రత్యేకంగా, ఆరుగురు ఆడసిబ్బందీ వున్నారు—అంగరక్షకసిబ్బందీ అనండి శరీరరక్షిబ్బందీ అనండి. మరొకటి యేమిటంటే: ఈ భూస్వామికశిఖామణి, దోపిడీపంథాలో,

అనువాదం: తెన్నేటి సూరి

చేజిక్కినంతవరకు అంజించుకోగల సమర్థుడు. అందుచేత, ఈ వివాహబాంధవ్యంవల్ల సాంఘిక నైతికాది విషయాల్లో ఆయన గౌరవమర్యాదలు యెలావున్నా — ఈ బయటి గదుల భక్తకోటికి మాత్రం ప్రత్యక్షదైవమై వెలసి కూర్చున్నాడు.

నిజంగా ఆ మందిరంలోని గదులన్నీ చాలా అందంగా వున్నమాట వాస్తవమే. శిల్పచిత్ర కళాసౌభాగ్యాలతో వెల్లి విరిసి పోతున్నాయన్నమాట కూడ నిజమే. కాని అక్కడి వ్యవహారమంతా సజావుగా వున్నదనటానికి వీల్లేదు. ఆమందిరంచుట్టూ వున్న వీధులనిండా చింపి పేలికలు, కంకాళ దేహాలూ వ్రేలాడుతుంటే మధ్యనున్న ఈ మందిరంలో మాత్రం సౌందర్యం వైరాయించి కూర్చోటానికి ఆస్కారమెక్కడుంది. ఇక ఆ బయటిగదులనిండా పడిగాపులు గాసున్నవా రెవరయ్యా అంటే యుద్ధమంటే యేమిటో యెరగని సైనికాధికారులు, ఓడఅంటే యేమిటో యెరగని నౌకాధిపతులు; పరిపాలనా వ్యవహారాల ఓనమాలు కూడా తెలియని సివిల్ ఉద్యోగులూ, కనిష్ఠతరగతి లౌకికవ్యవహారాల లుకలుకలు మినహా యితర పారలౌకిక విజ్ఞానంతో సంబంధంలేని, కౌముదాసులూ, కటికసన్యాసులూ, వాగుడు డబ్బాల్లూ అయిన మతాధికారులు ఇత్యాదయః; ఆయా అధికారాల్లో వుండటానికి వాళ్లల్లో యే ఒక్కడికీ యెలాంటి యోగ్యతలూ లేవు; యోగ్యతలు లేకుండా అధికారాలెలా వచ్చాయయ్యా అంటే: వడ్డించేవాడు మనవాడైతే కడబంతిని కూర్చొమన్నారు. ఈ జనాభాయావత్తూ దూరంగానో దగ్గరగానో మన ప్రభువుగారి బంధువర్గానికి చెందినవాళ్లు. అందుచేత ఏవి కావలిస్తే వాటినల్లా పిండుకోవటానికి ఆస్కారమున్న కామధేనువుల్లాంటి ఈ ఉద్యోగాలనన్నిటినీ వీళ్ళదొడ్లల్లో కట్టేశారు. ప్రభువుగారి రాజబంధువులమాట అలా వుంచండి: ప్రభువుతో గాని, ప్రభుత్వంతో గాని, మళ్లా మాట్లాడితే ఈ ప్రపంచంలో వాసవం అన్నదాంతో దేంతోనూ ఎద్విధమైన సంబంధంలేని మరోరకం మనుషులు ఆ మందిరంనిండా వందలాదిగా వున్నారు. ఈ రకం మనుషులకు జీవితంలో బుజుమార్గమంటూ యే ఒక్కటీ వుండదు. ఊహాకల్పితములైన వ్యాధులకు అపరూప మహౌషధములను నిర్ణయించుతూ రాజవంశానికి చెందిన తమ రోగులమీద చిరునవ్వులు ప్రసరించుతూ, జనానాగదుల్లో విచ్చలవిడిగా తిరిగే డాక్టర్లు; దేశానికి పట్టిన సమస్త యీతిబాధలకూ చిట్కాలు చెబుతూ, వాటిని నిర్మూలించటానికి ఎన్నడూ పట్టుమని వ్రేలైనా కదపకుండా, అందినవాడి చెవిలోనల్లా; అడ్డమైన అభూతకల్పనలూ పోస్తూ కుట్రలలో మునిగితేలుతూ వుండే రాజకీయవేత్తలు; మాటలతో ప్రపంచాన్ని మరమ్మతుచేస్తూ, వాగుడుతో స్వర్గానికి పేకమెట్లు నిర్మించే తాత్త్వికవేత్తలు రసవాద తర్జనభర్జనలలో రాటుతేలిన రసాయనిక శాస్త్రవేత్తలు; ఈ రకంవారంతా కోకొల్లలు.

ఆరోజుల్లో — ఆరోజుల్లో యేమిటిలెండి, అప్పటినుంచీ — గొప్పసంస్కృతిలో పెరిగిన పెద్దమనిషి అని చెప్పటానికి నిదర్శనమేమిటంటే, ఆ వ్యక్తికి మానవులకు సంబంధించిన యేవిషంతోనూ ఎలాంటి జోక్యమూ వుండకూడదు. మగవాళ్ల ఒకళ్లమాటే గాదు — అక్కడున్న మహిళామణులుకూడా అంతే. ప్రభువుగారి విందులకు హాజరయ్యే అతిథులలో సగానికిసగం గూఢచార మహాశయు లుంటారు. నిజానికి వాళ్లంతా కలిసి పరిశోధన జరిపినాగూడా ఆ విందులోవున్న మహిళారత్నాలలో, సంతానవతియైన స్త్రీ యెవరో చస్తే కనుక్కోలేరు నిజానికి, పిల్లాపీచును పెంచుతున్న చిహ్నాలేవైనా కనుపించి తేగదా గుర్తుబట్టటానికి. శిశువును కనటంవరకేగాని పెంచేబాధ్యత ఆ మహిళారత్నాల కేమిటి? కని యింటికాడ పారేసివస్తే, కూడులేని యే బీదవాడి పెళ్లామో ఆ శిశువుతో సదమదమౌతూవుంటుంది. అలాంటి సమాజంలో శిశువులను కలిగివుండటం అనాగరికత: బిడ్డాపీచునంతా యింటికాడ దాదులమొహాన గిరవాటేసి వచ్చి, అందగత్తెలైన అరవయ్యేళ్ల అమ్మమ్మలు కూడా, కనుగందని కన్నెపడుచుల్లా ముస్తాబై కూర్చుని విందులుగుడుస్తూ వుంటారు.

అవాస్తవికత కుష్ఠువ్యాధిలాంటిది. ఆ దొడ్డప్రభువు చుట్టూ వుండే పరివారంలో ప్రతి ఒక్కడికీ అదే జబ్బు. ఆ వ్యాధి కారణంగా ప్రతి ఒక్కడూ వికలాంగుడుగా కనుపించుతాడు. బయటి గేటుకు చేరువలోవున్న ఒక గదిలో మాత్రం ఒక అరడజనుమంది అదోరకం మనుషు లున్నారు. వాళ్ళకి యిప్పటికి అయిదారు సంవత్సరాలనుంచీ, దేశంలో ప్రతి వ్యవహారం డొంక

(21–వ పేజీ చూడండి)

# అత్తయ్య

"ఏం? ఈ రోజు బ్యాంకి లేదా?"

"లేదు సార్! యివ్వాళ మహా శివరాత్రి, శెలవుగాదటండీ?"

చెక్కు మార్చుకురావాలని తీరా బ్యాంకికి వెళ్తే గేటులోనే చెప్పాడు వాచ్ మన్.

మహా శివరాత్రి! మహా శివరాత్రి! నా హృదయం కంపించిపోతూంది భయంకరంగా వినిపిస్తూన్న సముద్రుడి ఘోషకు పదిహేను సంవత్సరాల జీవితానుభవాల తాలూకు చీకటిముసుగులు చెరిగిపోతున్నాయ్ ఉవ్వెత్తుగా లేచిపడ్తూన్న కెరటాలు వుప్పొంగివస్తూన్న మధురస్మృతుల్ని రెచ్చగొట్టున్నాయ్ పదిహేను సంవత్సరాల జీవితం అడుగున దాగివున్న అమరస్మృతులు కళ్ళెంలేని గుర్రాల్లా స్వారి చేస్తూన్నాయ్ నిర్మలమైన వినీలాకాశపు హృదయంలోకి నల్లటి పొగను విడుస్తూ, హార్బరులో వున్న నౌకల తాలూకు చిమ్నీలు ఏటవాలుగా తొంగిచూస్తున్నాయ్ హార్బరు రోడ్డునుంచి పారిస్ కార్నర్ మలుపు తిరిగాను ఎదురుగా హైకోర్టు న్యాయస్వరూపం, లైట్ హౌస్ విడిపోతూన్న తెల్లటి మబ్బు తునకల్ని ఆప్యాయంగా ఆహ్వానిస్తూన్నయ్

పక్కగా, అరంతస్తుల ప్యారిస్ బిల్డింగ్ భూతంలా మీదకు విరుచుకుపట్తూన్నట్టుంది! ఆ వాతావరణంలో భౌతికంగాను మానసికంగానూ ఎంతో చిన్నవాణ్నయి పోతూన్నట్టుగా అనిపించింది మలుపు తిరుగుతూ ట్రాం—'గర్ - గర్' మని చేస్తూన్న ధ్వనికి నా స్మృతిపథంలో పదిహేను సంవత్సరాలుగా, చలనరహితంగ పడివున్న రంతులరాటం కదిలింది 'ఒర్ - ఒర్' గిర్రున తిరిగిపోతూంది — గుర్రం ఏనుగూ, వుయ్యాలా, పొంచె, విమానం వయ్యిన తిరిగిపోతూన్నయ్ కోటిమీద తిరునాళ్ళో తిరుగుతూన్న రంతులరాటాన్ని విచిత్రంగా చూస్తూ మాణిక్యం పక్కన నుంచున్న నేను, నా తొమ్మిదేళ్ళ వయసూ, పొట్టిలాగూ, కోతచొక్కా, ఏడున్నరణాల చిల్లరా మళ్ళీ నాకొచ్చేసినయ్.

* * *

"అమ్మగోరూ! అబ్బాయిగోర్ని నా యెంట పంపండి?"

"అయితే, మళ్ళీ జాగ్రత్తగా తీసుకొస్తావా?"

"ఓ! నా సంగతి మీకు తెలవదాండీ అమ్మగారూ!"

"ఏంరా? అబ్బాయ్! మాణిక్యం వెంటట వెళ్తావా?" అమ్మ అడిగీ అడగడంతోటే తలగిర్రున వూపేశాను తిరునాళ్లకు వెళ్ళాలని కొండంత ఆశతో కూర్చున్న నాకు మాణిక్యం తనతో తీసుకెళ్తా ననగానే ఎంతో సంతోషం వచ్చింది పని మనిషి మాణిక్యం మీద నా కంతవరకూ వున్న తేలిక భావం ఎగిరిపోయింది ఆడదు అడవాళ్లందర్లోకి మంచివాళ్లెవరని నన్నడిగి వుంటే మాణిక్యం అనేసేవాణ్ని నన్ను తిరునాళ్లకు తీసుకెళ్లడాని కెవరు దొరుకుతారా అని చూడుట్న చీ ఎదురు చూస్తున్న మా అమ్మకు మాణిక్యం వచ్చి ఆమాట అడగ్గానే మనసు కుదుటపడింది పనిమనిషితో పంపటానికి మొదట్లో కొంత సంకోచించినా, కొడుక్కు కోటయ్యస్వామి దర్శనం చేయించాలనే ఆకాంక్ష ఆవేదనా అమెను పురికొల్పి వుంటై కొండంత సంబరం వూరికి రెండు మైళ్లల్లో జరిగిపోతూంటే యింట్లో దిగులు దిగులుగా కూర్చున్న నన్ను చూసి మాతృహృదయం సహించలేక పోయిందేమో జ్వరంతో బాధపడ్తూ కూడా ఆ యిల్లా, [illegible] తిరిగొచ్చి [illegible] కూర్చుంది. అట్లా ఆలోచనలో మునిగి [illegible]స్తూన్న ఆమె మాణిక్యం వచ్చి నన్ను తీసుకెళ్తా ననగానే కళ్లు చారడంత చేసుకొంది

"ఏమేవ్! భద్రంగా తీసుకెళ్ళి, తీసుకు రావాలి సుమా! చూడు, బాబూ! మాణిక్యాన్ని వదిలెక్కడికీ వెళ్లకూడదు అది చెప్పినట్టే వినుకోవాలి" అని హెచ్చరించి అమ్మ అర్ధరూపాయి బిళ్ల తెచ్చి నా జేబులో వేసింది ఐదులంఘణాలతో వున్న అమ్మకు పంచదార చిలకలమీద మనసయింది కాబోలు! వచ్చేప్పుడో కణావి తీసుకు రమ్మంది

మాణిక్యం, నేనూ, చేయీ - చేయీ పట్టుకొని చకచకా నడుస్తూన్నాం. సూర్యుడు నెత్తిమాడుస్తూన్నాడు, రోడ్డు చిటపటలాడ్తూంది కింద భూమి వెచ్చగా తగుల్తూంది నా పక్కన మాణిక్యం - గుండ్రంగా బొద్దుగా మాణిక్యం - వయ్యారంగా కదుల్తూంది తొమ్మిదేళ్లయినా నిండని నా బుద్ధికి నిండు యవ్వనపు పొంగులో వున్న దాని అవయవాల కదలిక చూస్తూంటే దానితోపాటు నడవలేకపోయాననే నిరుత్సాహం తప్ప యింకేం తోచివుండదు

కోటయ్యస్వామి తిరునాళ జరిగే ప్రదేశం సరిగా మా వూరికి రెండు మైళ్లు వుంటుంది ఒకానొకప్పుడు, ఎర్రరాతి క్వారీ దిబ్బల్లో వో పరమశివభక్తునికి వొక శివలింగం దొరికిందట! ఆ భక్తాగ్రేసరునకు పరమేశ్వరుడు కలలో కన్పించి కోరిన ప్రకారంగా - ఆ క్వారీ గుంటల్లో ఆ శివలింగం దొరికినచోట - కోటయ్యస్వామికి ఆలయ నిర్మించటం జరిగిందట అప్పట్నుంచీ ఏటేటా మహాశివరాత్రికి తిరునాళ్ళు జరుగుతూ వున్నయ్ ఆ చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళంతా 'కోటిమీద తిరునాళ' అనడం పరిపాటయిపోయింది

కోటకొండమీదుగా రోడ్డున తిరిగిపోతే రెండున్నర మైళ్ళవుతుంది దొంకతోవనైతే రెండుమైళ్ళే వుంటుంది రకరకాల ప్రభలు రోడ్డుమీద చింతచెట్లను రాసుకుంటూ పోతూన్నాయ్ ప్రభ చివర్లో తగిలించివున్న రాగిచెంబులు ఎర్ర ఎండలో తళతళా మెరుస్తూన్నయి ప్ర[illegible]లకు కట్టివున్న గంటలు ఘణఘణా [illegible]తూంటే భక్తకోటి ముక్తకంఠంతో [illegible]స్తూంది— ఏడుకొండలవాడా! రమణా! చేదుకో కోటయ్యా— చే[illegible]

చకచకా నడుస్తూన్న మాణిక్యం [illegible]

"వసశ్రీ"

ముని ఆగి; సాగిపోతున్న ప్రభలవైపు చూసి చెంపలు వేసుకొంది. నమ్రతతో రెండు చేతులూ పైకెత్తి — ఏడు కొండల వాడా! వెంకటరమణా! మమ్మేలుకో కోటయ్యా—అంది. నావైపు తిరిగి — "బాబూ! కోటయ్యసామిని మొక్కు!" అంది. మాణిక్యం చెప్పినట్టే చేశాను.

ఊరిబయటవున్న మస్తాన్ కొట్లో అర్ధణా యిచ్చి మాణిక్యం రెండు కిళ్లీలు కొంది. తనొక టేసుకుని, నాకొక టిచ్చింది. నోరు పట్టకుండావున్న ఆ కిళ్లీ నములుతూంటే ఎర్రటి వూటకారి నా తెల్లటి చొక్కా మరకలయింది. అది చూసి మాణిక్యం తన పైటచెంగుతో, నా బుగ్గల్ని, చొక్కాను తుడిచింది. "నీ నోరెంత బాగా పండింది బాబూ?" అంటూ మాణిక్యం తన ఎర్రటి పెదాల్ని నా పెదవులకు కలిపి గట్టిగా ముద్దుపెట్టుకొంది. అది అలా చేస్తూంటే నాకు వూపిరి సలపలేదు. పైగా, అది ఎంగిలి నాకు పులుముతూందన్న కోపంకొద్దీ దాని పట్టునుండి విడిపించుకొన్నాను. దాని పెదవులు, నా బుగ్గల పైనా పెదవులపైనా వదలిన ఎర్రటి ఎంగిలి మరకల్ని చేత్తో తుడుచుకొన్నాను. తుడుచుకుంటూన్న నన్ను చూసి అది నవ్వుతూంటే నాకు రోషం పెనవేసుకొచ్చింది. వడుపుగా వెళ్లి మాణిక్యం వల్లంచు పచ్చకోక కుచ్చెళ్లు పట్టుకొని నా ముఖానవున్న ఎంగిలంతా తుడుచుకొన్నాను. మాణిక్యం కిలకిలా నవ్వుతూ నన్ను దగ్గరగా లాక్కొని పైకెత్తుకొని నా బుగ్గపై మెల్లిగా కొరికింది. దాని సన్నని కంఠాన్ని కావలించుకొని ఎత్తైన మెత్తని రొమ్ములమీద వ్రేలాడుతూన్న నన్ను కిందకుదించి—

"బాబూ! తొందరగా ఎల్దాం పద! కోటయ్యసామి దర్శనం చేసుకోవద్దూ?" అంటూ నా ఎడంచేతిని తన కుడిచేత్తో పట్టుకొని చకచకా నడక సాగించింది. నోట్లో వున్న కిళ్లీ నములుతూ, తల్లోంచి భుజాలపైగా కారుతూన్న చెమటను తుడుచుకుంటూ, తిరునాళ్లు చూడబోయే వాటిని మనసులో చిత్రించుకొంటూ కొద్దిపాటు పరుగులో - మాణిక్యం వెంట నడుస్తూవున్నాను.

దొంగలతోపు దగ్గరకు రాగానే రోడ్డు దిగి డొంకనే నడుస్తూన్నాం. రోడ్డు దిగగానే మా పెదనాన్నగారి జీతగాడు వెంకటేసు మమ్మల్ని కలుసుకొన్నాడు.

"ఏం? మాణిక్యం! యియ్యాలదాకా వుండావేం? ఇంతగ్గిలో నడుత్తావుండావ్"

మాణిక్యం మాట్లాడకుండానే వాడి వంక వోసారి చూసి, వుసిగా నడుస్తూంది.

"సిన్నబాబయ్యగోర్ని కూడా రెంటేసుకొత్తన్నావ్! ఎంటీ గిరాకీ?" మాణిక్యానికి పక్కగా వత్తా అన్నాడు వెంకటేసు.

మాణిక్యం మాట్లాడకుండానే, రెండో పక్కనున్న నన్ను, వాడికీ, తనకూ మధ్యగా తీసుకుంది. దూరంగా కనబడుతూన్న తిరునాళ పందిళ్ళు, దుకా



ణాలు, ప్రభలూ నాలో వుత్సాహాన్ని రేకెత్తిస్తున్నాయి.

"ఓస్! నీ...పలుకే బంగారమైందేమే చిలకోయ్?"

"ఎందుకయ్యా పలికేది?" మాణిక్యాం పక్కగా – నామీదగా - వాణ్ని వోరగా చూస్తూ అంది.

"అద్గంతుకే? చిలకా!" వెంకటేసు గాడు బొడ్లోవున్న వెండిరూపాయితీసి ఖంగున మోగించి మళ్లా బొడ్లో దోపుకున్నాడు.

"అదిసరేకాని, యిప్పుడుదాకా ఆ దొంగల్తోపులో కూకోని ఏం చేత్తుండట్టు? వోరికోసం సూత్తుండావురా? దొంగ సచ్చినోడా! నవ్వుతూ అంది మాణిక్యాం.

"నీకు తెలియందేముంది లేవే చిట్టమ్మి?" వేంకటేసుగాడు మాణిక్యాం వీపున వొక్కటి చరిచాడు.

"ఆసుంటకుండబ్బియ్యోయ్! నేనసలు మంచి దాన్ని కాను." కళ్లెర్రచేసి అంది మాణిక్యాం.

"సర్లేవే; నీ మొగుడు కొండిగాడేడే?"

"కోటప్పకొండ కెళ్ళిండు."

"మరి, నువ్వెల్లలేదేమే?"

"సచ్చినోడు తీసుకెళ్లందే?" వుసూరుమంటూ అంది. మాణిక్యాం మొగుడిమీద నాకు బలే చెడ్డకోపం వచ్చింది. కొండిగాడు దాన్ని కొండకు తీసుకెళ్తే నన్నెవరు తీసుకెళ్ళేవారు? అయితే, కొండిగాడు మంచివాడే. మంచిపని చేశాడు.

"పుల్లాంగారి అచ్చాంను యెంటేసుకెళ్ళాడంటగా?"

"ఏం చచ్చాడో, ఎదవ సచ్చినోడు." నిట్టూరుస్తూ అంది మాణిక్యాం. బలే పని చేశాడులే అనుకున్నా నేను.

"ఎదవ ఎట్టపోతే నీకేంతక్కువ లేవే?" వెంకటేసుగాడు కోరమీసం మెలేశాడు. పైపంచ తలకు చుట్టుకొన్నాడు.

"ఓస్! దీన...నిలవడంలేదే" అంటూ బొడ్లోనుంచి రూపాయితీసి మాణిక్యానికి యివ్వబోయాడు.

"ఓయ్! నాకెందు కయ్యోయ్?"

రూపాయలు యిస్తూంటే వద్దంటుందేం పిచ్చిముండ. రూపాయిపెడ్తే ఎన్ని కొనుక్కోవచ్చు! దానిమీద బలేకోపం వచ్చేసింది.

"పరవాలేదులే — స్స! వుంచుకో." వెంకటేసుగాడు మాణిక్యాం చేతులో బలవంతంగా పెట్టాడు. వెంకటేసుగాడు ఎంత మంచోడు!

వెంకటేసుగాడు ఏమేమో మాట్లాడుతూ మధ్యమధ్య బూతులు కూస్తున్నాడు. మాణిక్యాం వింటూ అప్పుడప్పుడూ సన్నగా నవ్వుతూంది. అదంతా వాడు తిడుతూంటే అదెందుకు నవ్వుతూందో నాకు అర్థం కాలేదు. దాన్ని వాడలా తిడుతూన్నప్పుడల్లా వాడిమీద నాకు చెడ్డకోపం వచ్చేది. మాణిక్యాం, నేనూ వాణ్ని వదలిపెట్టిపోతే బావుంటుందనిపించింది. అయితే, వాడు యిచ్చిన రూపాయి కాస్తా లాక్కుంటాడేమో నని భయం వేసింది.

ముగ్గురం డొంకమలుపు తిరిగి రోడ్డు ఎక్కి నడుస్తున్నాం. ఉత్సవం జరుగుతూన్న ఆ చోటంతా ఎర్రదుమ్ముతో నిండిపోయింది. ఆ రొదకు చెవులు చిల్లులు పడిపోతూన్నాయ్. గుడిచుట్టూ విశాలంగా తాటాకుపందిళ్ళు వేసి వున్నయ్. గుడి ముందు రకరకాల ప్రభలు విడిచివున్నయ్. రోడ్డుకు రెండు వైపులా దుకాణాలు, మధ్యమధ్య మంచినీటి చలవపందిళ్లు ఉన్నయ్. గుడికి కుడిపక్కగా కొబ్బరికాయలదుకాణాలు ఎడంపక్కగా చెరుకు దుకాణాలూ బారులు తీర్చివున్నయ్. వాటికి కొంచెం దూరంగా రంకులరాటాలు, బొమ్మలాటలూ, లాటరీలూ వున్నయ్. అవి చూస్తూంటే నా కాళ్ళల్లోకి ఎక్కడ లేని సత్తువా వచ్చినట్టయింది. నా కుడిచేతిని పట్టుకున్న మాణిక్యాన్ని లాగుతూ తొందరగా నడుస్తున్నాను. మా వెనకగా వెంకటేసుగాడు నడుస్తూన్నాడు. ఒక కానీ పెట్టి వొకబూర, యింకో కానీ యిచ్చి తిమ్మిరిబిళ్లలూ కొన్నాను. మాణిక్యాం పోట్లాడబట్టి వాడు ఎనిమిది బిళ్ల లిచ్చాడు. లేకపోతే ఐదే యిచ్చేవాడు.

సోడాబండి దగ్గరికి తీసుకెళ్ళి వెంకటేసుగాడు మూడుసోడాలు కొట్టించాడు. సోడా కొట్టూంటే మాణిక్యాం చెవులు మూసుకొంది. నేనేమో వులిక్కి పడ్డాను. ఎంకటేసుగాడు అసలు భయపడనేలేదు. అబ్బ! ఎంతమోత మోగింది – కీస్ మని!

సోడా తాగుతూంటే నాకు రెండుసార్లు గోలీ అడ్డం పడ్డది. మాణిక్యాం దాన్ని వేల్తో పొడిచేప్పటికల్లా తుస్‌న లోపలికి పోయింది. మూడోసారి పొగరు ముక్కుల్లోకిపోయి కొలమారింది. నే తాగగా వదిలి పెట్టింది మాణిక్యాం గుటుగుటా తాగింది. ఎక్కిలాలే నా యెంగిలి తాగిందని గంతులువేశాను. వాడు సోడాకాయ కాయా వొక్క గుక్కన తాగేశాడు.

జనాన్ని తోసుకుంటూ రంకులరాటం దగ్గరికెళ్లాం. గర్ – గర్ – అంటూ రయ్యిన తిరుగుతూంది రంకులరాటం. గుర్రం, ఏనుగూ, వొంటె, విమానం, వుయ్యాలా తుర్రున వస్తూన్నయ్. ఝుర్రున పోతూన్నయ్. ఎక్కి తిరిగేవాళ్లు,

కేకలూ, యీలలూ వేస్తూన్నారు. రంకులరాటం తిప్పుతూ పాడుతూన్నారు– "చల్ మోహనరంగా;– నీకు నాకు జోడు కలిసే పదరా పోదాం."

"మాణిక్యం? రంకులరాటం ఎక్కుదా మంటే?" అన్నాడు వెంకటేసుగాడు.

"అమ్మో! నాకు భయమేత్తది." అంది మాణిక్యం పమిట చుట్టుతిప్పి దోపు కుంటూ.

"భయమేం బయమే? అట్టా అయితే ఉయ్యాల్లో కూకుందాం" అన్నాడు.

మాణిక్యం – "బాబూ! నువ్వుకూడా ఎక్కుతావా?" అంది.

"వోఁ!" అంటూ మెల్లిగా తలూపాను, లోలోపల భయపడ్తూనే.

ఉయ్యాల్లో – మాణిక్యానికి, వెంకటేసుగాడికి మధ్యగా కూర్చున్నాను.

రంకులరాటం తిప్పుతూ, – 'నీకూ నీవారు లేరూ, – నాకూనావారులేరు. చల్ మోహనరంగా – నీకు నాకు జోడుకలిసే – పదరా పోదాం–' పాడుతూన్నారు అరె! మాణిక్యానికి కూడా వచ్చుట్టుందీపాట. పాడుతూంది.

'కాయ్ రాజా! కాయ్! కానీ – కానీ; ఎక్కు; ఎక్కు – వొంటే, గుర్రం, వుయ్యాలా – ఏనుగూ, యిమానం– ఒకటీ, – రెండూ – మూడూ –' గిర్రున తిరుగుతోంది రంకులరాటం. హోయ్! హోయ్! అంటూ, యీలలు వేస్తూ వెంకటేసుడుగాడు బుజా లెగరేస్తున్నాడు. యీలలూ, 'తిప్పూ, తిప్పూ!' అంటూ కేకలూ, మోగిపోతూన్నాయ్.

గుడీ, పందిళ్ళూ, దుకాణాలూ, ప్రభలూ, జనం – అంతా నా కళ్ళలో గిర్రున తిరిగిపోతున్నాయ్. ఆకాశం కిందికీ, భూమి పైకీ పోతూన్నట్టుగావుంది. నా కళ్ళు గిర్రున తిరిగిపోతూన్నాయ్. మసకలు కమ్మిపోతూన్నాయ్. మాణిక్యాన్ని గట్టిగా వాటేసుకున్నాను. మాణిక్యం నాపైగా వంగి వెంకటేసుగాణ్ని పెనవేసుకుపోయింది. వాడు దాన్ని గట్టిగా పట్టుకొన్నాడు.

రంకులరాటం దిగి గుడివైపు వెళ్లాం. కోటయ్యస్వామిని చూడాలనే కోర్కె నాలో గిలిగింతలు పెట్టూంది. అమ్మకు జబ్బు నయంచేయమని కోటయ్యస్వామిని వేడుకోవాలి. కొబ్బరికాయ కొడ్తే అమ్మకు జ్వరం తప్పకుండా నయంచేస్తాడు...

జనాన్ని తోసుకుంటూ, సందుచేసుకొని మెల్లగా చేయీ, చేయీ పట్టుకొని నడుస్తూన్నాం.

గుడికి దగ్గరగా వెళ్లేకొద్దీ వత్తిడి ఎక్కువై పోతూ వుంది. జనం గుంపులు గుంపులుగా తోసుకు వస్తూన్నారు. మాణిక్యం మీదకు మరీ మరీ తోసుకొస్తున్నారు. దాని మీదకు పడ్తూన్న వాళ్ళను వెంకటేసుగాడు పక్కకు నెట్టేస్తున్నాడు. ఆ వత్తిడికి నా కాళ్ళు నలిగిపోతూన్నయ్. ఒక్కసారిగా జనం గలిబిలిగా అరుస్తూ వొకళ్ళ నొకళ్లు పడతోసుకున్నారు. ఆ తోపిడిలో నేను కిందపడిపోయాను. నా పక్కగా బెదరిపోయిన వొక ఎద్దు తలవంచి తోకపైకెత్తి పరిగెత్తి పోతూంది! కొంచెంలో తప్పుకొన్నాను. లేకపోతే తొక్కి వేసేదే! లేచి నుంచొని దుమ్ముదులుపుకుంటూ మాణిక్యంకోసం వెతికాను. ఆ చుట్టు ప్రక్కల ఎక్కడా కన్పించలేదు. అప్పుడే మళ్ళీ జనం చుట్టూ కమ్ముకువసూన్నారు. 'మాణిక్యం – మాణిక్యం– వొచ్చేయ్. మాణిక్యం.' అని బిగ్గరగా అరిచాను.

అరుస్తూనే జనాన్ని తోసుకుంటూ గుడి వైపు వెళ్లాను; ఆ పక్కనేవున్న కొట్లో మూగుకొన్లుపెట్టి పీచుతీసి వున్న కొబ్బరికాయ కొన్నాను. కొబ్బరికాయ తీసుకొని, జనం కాళ్లమధ్యగా సందుచేసుకొంటూ గుళ్లోకి వెళ్లాను. జనం ముందుకూ, వెనక్కూ నెట్టుకున్నారు. ఈసారి వెళ్ళడం మరీ కష్టమైంది. కొబ్బరికాయ వొచేత్తో పట్టుకొని మగో చేత్తో జనాన్ని నెట్టుకోవాల్సి వచ్చింది. ఆడవాళ్ళు కన్పించిన పుడల్లా మాణిక్యం ఏమోనని ముఖం వెతికిచూస్తూవున్నాను. మాణిక్యంలాగా, లావుగా, పచ్చకోక కట్టుకున్న వాళ్ళుకూడా మాణిక్యం కాకపోయేసరికి దానిమీద కోపం ఏడుపూ వచ్చేయ్. కోటయ్య స్వామిని చూడబోతున్నా నన్న వుత్సాహం, దేముడిమీది భక్తీ అన్నిటినీ మరిపించివేస్తున్నయ్. ఇంత పెద్ద కొబ్బరికాయ దేముడికి కొడ్తే అమ్మకు జ్వరం తప్పకుండా నయంచేస్తాడు అనుకుంటూ స్వామిదర్శనంకోసం ఆ గుంపులో పడి పెనగులాడ్తూ వున్నాను. ఫట్! ఫట్! మని కొబ్బరికాయలు కొట్టూన్న ధ్వని వినిపిస్తూంది. పైన వేలాడుతున్న గంట ఎడతెరిపిలేకుండా మోగుతూంది. "చేదుకో కోటయ్యా! శంభోశంకర! హరహరా...' అంటూ ఆలయమంతా ప్రతిధ్వనించిపోతూంది. కాళ్ళకింద ప్రవహిస్తూన్న బెల్లం పానకం కాళ్ళకు అతుక్కొని కాళ్ళు జిగటలు తేలుతూన్నాయ్. హరహరా! అంటూ నా వెనకున్న జనం వొక్కతోపు తోశారు. అదృష్టంకొద్దీ ఆ పూపుకు గర్భగుడిద్వారం దగ్గర కొచ్చిపడ్డాను. చీకట్లో నిగనిగా మెరిసిపడుతూన్నాడు కోటయ్యస్వామి. దణ్ణం పెట్టాను. కొబ్బరికాయ కొటబోయేసరికి చేతిలో కొబ్బరికాయ

లేదు. దానితాలూకు పీచుమాత్రం చేతిలో మిగిలివుంది! చేతిలో వున్న కొబ్బరిపీచు చూడగానే పెద్దగా ఏడు పొచ్చేసింది. కాయ లేకుండా పీచు తెచ్చినందుకు కోటయ్యస్వామికి ఎంత కోపం వస్తుందో? చేతిలోవున్న దాన్ని కిందపారేసి రెండు చేతుల్తో చెంపలు వేసుకొన్నాను.

చేతులు జోడించి—"కోటయ్యస్వామీ! వచ్చే పండక్కి తప్పకుండా రెండు కొబ్బరికాయలు తెచ్చిస్తాను. కోపం వుంచుకోక. మా అమ్మకు జ్వరం తొందరగా నయం చేయి స్వామీ!" పొంగి వస్తూన్న ఏడుపును ఆపుకుంటూ వణుకుతూన్న పెదాల్తో మెల్లిగా అన్నాను.

అంటూండగానే, నన్ను వెనక్కి నెట్టేశారు. సరిగా గుడిగంట కింద కొచ్చి పడ్డాను. అక్కడున్న వాళ్ళంతా వొకళ్ళ నొకళ్లు తోసుకుంటూ ఎగిరెగిరి గంట కొట్టూవున్నారు. అట్లా ఎగురుతూన్న వాళ్లల్లో వొకడు నామీద పడ్డాడు. అరుస్తూనే కింద పడిపోయాను.

అంతలోనే 'అమ్మో! నా బిడ్డా!' అంటూ నన్నెవ్వరో పైకెత్తుకొన్నారు. ఆ వత్తిడిలో నన్నెత్తుకుం దెవరో తెలియ లేదు. అయోమయంగా వుంది. ఆ ఎత్తుకుంది మాణిక్యం మాత్రం కాదు. అది యీమె కంటే లావుగా పొట్టిగా వుంటుంది. యీమె అంతా మా పిన్నిమాదిరిగా వుంది. మా పిన్ని అంతా యిట్లానే వుంటుంది.

జనాన్ని తప్పుకొని బయటికి తీసుకొచ్చింది. ఆమెవెంట యింకో మగమనిషి కూడా వున్నాడు. విడిచివున్న సవారి బళ్ల దగరకు తీసుకొచ్చి నన్ను కిందకు దించుతూ అంది—

"బిడ్డను అన్యాయంగాతొక్కేసేవాళ్లు"

"చూడు బాబూ! ఎవరితో వచ్చావ్! మీ వాళ్లెక్కడున్నారు" అని అడిగింది.

వెక్కి వెక్కి ఏడుస్తూ—"మాణిక్యం—" అన్నాను.

"ఊరుకో బాబూ! భయంలేదులే" అని ఆమె నా బుగ్గలు నిమిరింది. ఇంతలోకె యింకిద్దరు ఆడవాళ్లు అక్కడి కొచ్చారు. జిందులో వొకావిడ—

"కాంతం!-ఎవరే ఆ పిల్లాడు?" అంది.

"ఎవరో నమ్మా! తుల్లోమారుపడి పోయాడు. బిడ్డ అన్నుపట్టిపోయాడమ్మ పాపం!" అంది.

"ఇదిగో! అబ్బాయ్; ఏ వూరమ్మ మీది?" మగాయన అడిగాడు. చెప్పాను.

అయితే, పుల్రాణ్ణి ఆవూరి బళ్లు ఎక్కడున్నయ్యో కనుక్కొని వదిలేద్దాం. అన్నాడు.

అందుకామె—"అయ్యో! అదేమిటండీ? అలా అంటారూ! మనూరు తీసుకుపోయి తెల్లారి మనిషినిచ్చి పంపుదాం" అంది.

అందు కాయన ఆమె మీద కసురు కొన్నాడు. మా వూరిమీదుగా మంచాల అగ్రహారం పోతూన్న బండిదగ్గరకు తీసుకొచ్చి వొకామెకు అప్పచెప్పారు.

నన్ను బండిదగ్గరకు తీసుకెళ్తూ దోవలో పంచదార చిలుకలు కొనిచ్చింది కాంతం.

"చూడు కమలం! జాగ్రత్తగా తీసుకెళ్లి వాళ్లమ్మకు అప్పచెప్పు" అని ఆ కొత్తామెకు చెప్పింది.

వెళ్తూ—"నా బాబు కదూ!" అంటూ నా చెంపలు నిమిరి వెళ్ళిపోయింది.

"చూడు బాబూ! నీ పేరేమిటి?" నన్ను దగ్గరగా తీసుకొని తలనిమురుతూ అడిగింది ఆ కొత్తఆమె. ఆమె అంతా మా చిన్నత్తయ్యలా వుంది; సన్నగా, ఎర్రగాను. బిక్కుబిక్కుమంటూ కూర్చున్న నన్ను ఒళ్ళోకి తీసుకొని చాలా కబుర్లు చెప్పింది. పీసుమిఠాయి, ద్రాక్షపళ్ళు కొని పెట్టింది. కమలాన్ని చూస్తూంటే నాకు బలేసరదా పుట్టింది. చాలా యిష్టం అయింది. ఎంచక్కా మాటలు చెప్తూంది. ఏ దడిగినా కొనిపెట్టూంటేను, తగరం కాగితంలోవున్న చాక్లెట్ ఎంత బావుంది ఎప్పుడూ కమలత్తయ్యదగ్గిరే వుండిపోతే?

ఏం చిన్నత్తయ్య? పాడత్తయ్య. వాళ్ల చెట్టుకున్న జాంకాయలు కూడా కోసుకోనివ్వదు. ఈ కొత్తఅత్తయ్య ఎంత మంచిది.

తర్వాత, కమలం అత్తయ్య నన్ను బొమ్మల దుకాణం దగ్గిరకు తీసుకెళ్ళి రాధాకృష్ణుడి బొమ్మకొని పెట్టింది. తిరిగొచ్చేప్పుడు అత్తయ్యకు రంకులరాటం చూపిస్తూ అడిగాను.

"అది నువ్వెప్పుడన్నా ఎక్కావా అత్తయ్యా?"

"ఛీ! పాడు మనం ఎక్కకూడదు."

"అయితే, మాణిక్యం, నేనూ, మరేమన్నా వెంకటేసుగాడు ఎక్కేంగా మరి!"

"వాళ్ళెవో అలగావాళ్ళు; అందుకని ఎక్కేరు."

"మనం అలగా వాళ్ళంకాదా ?"

"ఊహుఁ" నాబుగ్గగిల్లుతూ, నవ్వుతూ అంది.

"అదెక్కి తిరుగుతూంటే ఎట్లావుంది?" అడిగింది అత్తయ్య.

"అబ్బో! బలే బాగుందిలే! గిర్రున తిరుగుతూంటే, ఎంత బావుంటుందనుకున్నావ్? మాణిక్యానికేమో భయ

మేసి వెంకటేసుగాడ్ని వాటేసుకొంది."
హి - హి అని యికిలించాను.

"అలాగా?" రాగం తీస్తూ అంది అత్తయ్య కళ్లుతిప్పుకొంటూ.

"అత్తయ్యా! నీకూడా రంకులరాటం ఎక్కాలనిపించడం లేదు."

"ఊఁ" అని తల తిప్పింది.

"అయితే, ఎక్కుదాం రా..."

"ఛీ! తప్పు! మీ మామయ్య చూస్తే వూరుకోడు. అసలు మనం ఎక్కకూడదని చెప్పలా." తిరిగి బండిదగ్గరకొచ్చాం. మా వెనకాలే నలుగురైదుగురు మగాళ్లుకూడా వచ్చారు.

"వాళ్ళంతా మన బండిలోనే వస్తారా అత్తయ్యా!" ఆ మాటకు అత్తయ్యకు కోపంవచ్చినట్టుంది. నా నోరు తనచేత్తో మూసింది.

"వాళ్లెవరో రౌడీ వెధవలు! ఆడాళ్ళు కనపడ్తే సరి! వెంటపడ్తారు."

"అందమైన ఆడవాళ్ళు కనపడ్తేనే..." అందులో వొకడన్నాడు. మిగతా వాళ్ళంతా పగలబడి వెకిలిగా నవ్వేరు. వాళ్లూ మాబండికి కొంతదూరంలోనుంచుని అత్తయ్యవైపే చూస్తున్నారు. అందులో వొకడు నన్ను రమ్మని చెయ్యివూపేడు కూడా.

అత్తయ్యా నేనూ బండెక్కి జల్లలో కూర్చున్నాం. ఆమె ఏదో అడుగుతూంది. నే నేదో చెప్తున్నాను. అత్తయ్య మధ్య మధ్య సవారికంతల్లోగుండా బయటికి చూస్తూంది. చీకటి పడ్తోంది. నాకు కళ్ళంతా నొప్పులుగావుంది. నిద్రముంచుకొస్తూవుంది. జల్లచెత్తలో తలపెట్టుకొని పండుకొన్నాను. అత్తయ్య నాతల తన వళ్ళోకి తీసుకుంది. అత్తయ్య వళ్ళో హాయిగా కునుకు పడ్తూంది.

ఇంతలోకే వొకాయన బండిదగ్గర కొచ్చాడు.

"ఇంతసేపెక్కడున్నారండీ?"

అత్తయ్య అన్నది వినిపించుకోకుండానే ఆయన విసురుగా అన్నాడు.

"బండి వదలి వెళ్ళొద్దని చెప్పలా నీకు?"

"నే నిక్కడి కెళ్లానండీ—" దీర్ఘం తీస్తూ అంది అత్తయ్య.

"పైగా అబద్ధాలు కూడాను. నీవు బొమ్మల దుకాణం దగ్గర్నుంచి వస్తూంటే నే చూడలా?"

"అయ్యో! ఖర్మ; అదటండీ. ఈ అబ్బాయికో బొమ్మకొనిద్దామని—"

"ఏ అబ్బాయికి?" అని తనంటూంటే నా బొమ్మ లాక్కుంటాడేమో నని భయం వేసింది. అత్తయ్య సాగురించి చెప్తూంటే 'వూ' కొట్టూ ఆయన బండెక్కాడు.

"అందుకేనా? సొంత కొడుకులా వళ్లో పండుకోబెట్టుకొన్నావ్?" ఎడ్లను అదిలిస్తూ అన్నాడు. నన్ను అత్తయ్య వళ్ళోంచి లాగేస్తాడేమో నని భయం వేసింది. ఆమె వళ్ళోంచి లేచి, దూరంగా జరిగి పడుకుందామని కదిలాను.

...య్య నన్ను అదిమిపట్టుకొని, నా చె..., వెన్ను నిమురుతూ అంది—

"ఎవరి బిడ్డయితే నేమండీ? రత్నంలా వున్నాడు. ఆ మహాజన సముద్రంలో పడి వంటరిగా ఎంత అవస్థపడ్డాడో ఏమో పాపం. ఏడ్చిఏడ్చి కళ్లన్నీ వాచిపోయినై. కళ్లు కూడా వెచ్చగా వుంది. పాపం వాళ్ళమ్మ ఎంతగా ఎదురుచూస్తూందో బిడ్డ కోసం..."

బండి రోడ్డుమీద దడదడా శబ్దంచేస్తూ పోతూంది. ఇంటిముఖం పట్టిన జనం ప్రభల వెంట నడుస్తూ గోడచేస్తున్నారు. "హరహరా! చేదుకో కోటయ్యా..." కొత్త అత్తయ్య వళ్లో వెచ్చగా నిద్రపట్టింది.

* * *

మహాశివరాత్రి! మహాశివరాత్రి! పదిహేను సంవత్సరాలకాలం తెరల వెనక దాగివున్న ఆనాటి అనుభూతులు స్ఫురణ

కొచ్చి హృదయం స్పందించిపోతూంది. వెళ్లాలి! వెళ్లాలి...కోరిమీద తిరునాళ్ళకు— కోటప్పకొండ, గోవాడ, కొత్తపల్లి, అరవపల్లి, మోపిదేవి, శ్రీశైలం—వెళ్లాలి. వెళ్ళి ఆ కదలిన జనసమూహంలో కలిసిపోవాలి. ప్యారి బిల్డింగ్, లైట్‌హౌస్, చైనాబజారుకు దూరంగా — ఇంకో దూరంగా పారిపోవాలి. రెండువందల ఏభైమైళ్లలో జరుగుతూన్న కోరి తిరనాళ్లో కలిసిపోవాలి! హృదయంలో ఏదో తెలియని ఆవేదనా, మూగబాధ,మంటా నన్ను వేధిస్తున్నాయ్!

ఆరోజంతా పిచ్చెత్తిన వాడిలా తిరిగాను—ఒలంపిక్ స్పోర్ట్సు జరుగుతూన్న స్టేడియంకు వెళ్ళాను. పరుగుపందెంలో వెనకపడ్డవాణ్ని చూసి యువతులంతా, చప్పట్లు చరుస్తూ అవహేళన చేస్తూన్నారు. ఆవాతావరణంలో ఒక్కక్షణం వుండలేకపోయాను. లేచి వెళ్ళాను. మెరినా క్యాంటిన్, స్విమ్మింగ్ పూల్, శాంథోమ్ బీచ్, మౌంట్‌రోడ్డు, పాండీ బజారు, తైనాంపేట, చైనాబజార్, తంబుచెట్టిస్ట్రీట్, లాయడ్స్‌రోడ్, వాహినీ స్టూడియో—ఎక్కడా లేదు, ఆ జీవితం. లేదు ఆ ఆనందం. అంతా అబద్ధం — కృత్రిమం...

తిరిగిన కొద్దీ నాలోని బాధ పెరిగిపోతూంది. సాయంకాలం అయిపోతూంది. చీకటి పడ్తూంది. తిరునాళ్ళకు వెళ్ళినజనమంతా యిప్పటికప్పుడే, తిరిగి యింటికి వస్తూవుండొచ్చు! మోకాళ్ళవరకూ ఎర్రదుమ్ముకొట్టుకొని చెరుకుగెడలు భుజాన వేసుకొని వస్తూవుంటారు. తమ తమ అనుభవాల్ని ఒకళ్ళకొకరు అమాయకంగా చెప్పుకుంటూ వస్తూవుంటారు.

ఈపాటికి మాణిక్యంకూడా యింటికి వస్తూవుంటుంది. వెంకటేసుగాడు యీసారి కూడా రూపాయి యిచ్చాడా? మాణిక్యం యీసారి రంకులరాటంలో— గుర్రమెక్కిందో, వుయ్యాలే ఎక్కిందో, విమానమే ఎక్కిందో? కోటిగాడు కోటప్పకొండకే వెళ్లుంటాడా?

కాంతం యీసారికూడా అలోగుల్లో గంటమోగించిందా? కిందపడి పోతూన్న ఎవర్ని పైకి తీసుకుని ఎత్తుకుందో?

కమలత్త — కొత్త అత్తయ్య — తిరుగుతూన్న రంకుల రాటాన్ని ఎంతదిగులుగా చూసిందో? బొమ్మలకొట్టుకెళ్లి వస్తూంటే మళ్ళీ మగాళ్ళు వెంటపడ్డారా? ద్రాక్షపళ్ళు, రాధాకృష్ణుడి బొమ్మను కమల అత్తయ్య యీసారి ఎవరికియిచ్చిందో? వళ్ళో తలపెట్టుకొని పండుకుంటే భర్త యీసారికూడా అంత అసూయగా, మాట్లాడేడా? వెళ్ళాలి! కోరి తిరనాళ్ళకే వెళ్ళాలి; వెళ్లిచూడాలి—మాణిక్యం — కాంతం — కమలం — అందర్నీ చూడాలి. ఈసారి తిరునాళ్ళకు ఎంతమంది — మాణిక్యం — కాంతం — కమలం — లు వచ్చారో?

తిరునాళ్ళంటే కదిలిన స్త్రీహృదయం— అర్పించబడిన స్త్రీహృదయమే నేమో?

ఆ తిరునాళ్ళకేపోవాలి. పోయి, స్త్రీ హృదయం - ప్రేమ,-కరుణ,-వాత్సల్యం,- సానుభూతి - మాతృత్వం - అందుకోవాలి. అందుకొని అనుభవించాలి. ఆనందించాలి. ఆ కదలిన మహా సమూహంలో కలిసిపోవాలి. పొంగిపొరలే ఆ ఆనంద సముద్రంలో మునిగిపోవాలి. వికసించిన స్త్రీ హృదయంలో దాక్కోవాలి. చేతులు చాచిన స్త్రీ వొడిలో వెచ్చగా నిద్రపోవాలి...

సెంట్రల్ స్టేషన్‌కు పరుగెత్తి వెళ్లాను. అప్పుడే కలకత్తా మెయిల్ నల్లటి పొగ వదలి, స్టేషన్‌పై చిమ్మచీకటిని కలిగిస్తూ ప్లాట్‌ఫారం వదిలేసి పోతూంది.

ఇంజన్ డ్రైవర్ విప్పుతూన్న పందిళ్ళనూ, ఎత్తివేస్తున్న దుకాణాల్ని, మాణిక్యం, కాంతం, కమలం తిరిగి నడిచిన - ఆ ప్రదేశాన్ని - ఆ క్వారీ దిబ్బల్ని బహుశః చూస్తాడు. ఎంతఅదృష్టవంతుడు? ఇక నాకు మిగిలింది - కోరి తిరనాళ్ళకు 250 మైళ్ళ దూరంలో - యీరాక్షస నగరంలో మహాశివరాత్రిని కాళరాత్రిగా తెల్లార్చుకోటమేనా? మనసులోని అత్తయ్యను మనసులోనే చూసుకోవాల్సిందేనా? ★

# చదరంగం

[వెంకటశాస్త్రి అరుగుమీద కూర్చుండగా రామారావు ప్రవేశం]

రామారావు:— వెంకటశాస్త్రిగారూ! చదరంగపెత్తు వేద్దామా?

వెంకటశాస్త్రి:— నిన్న సాయంత్రం ఏదో ఖర్మంజాలక ఓ యెత్తుకట్టాం కదా అని వేళాకోళం పట్టించావా బాబూ, అయితే కాసుకో.

రామా: కాలక్షేపం గాని పోళన కోసమా! 'జయాపజయాలు దైవాధీనం' అన్నారు. సరదాకి ఆడుకునేదానికి జయమేమిటి? అపజయమేమిటీ?

వెంక: ఏమేవ్! చదరంగం చీటూ, భరణీ యిల్లా పడేయి. ఇతనో సారి కట్టేస్తేగాని మాట దక్కేట్టు లేదు.

రామా: ఏమండోయి! ఎర్రబలం నాది. జయబలం అది.

వెంక: తీసుకోవయ్యా, నిర్జీవబలంలో ఏముందీ, బుర్రలో వుంది గాని.

[ఇంతలో గవరయ్య, నారాయణరావు వచ్చి చెరో వైపునా కూర్చుంటారు. రామారావు బలాన్ని గబగబా జరుపుతూ]

రామా: శాస్త్రిగారూ! చర చరా నడపాలి.

వెంక: తుర్రతనపు చేష్ట చెయ్యకు, ఆలోచించాలి, ఎత్తువెయ్యాలి. అంతేగాని నావంటి పేరున్న వాళ్లు తొందరపడి తురక కూడు తినరు.

**శ్రీ వై. జి. రాజు**

రామా: పోనీవయ్యా, నీ యిష్టంవచ్చినట్టు వెయ్యి, బాబూ. దానాలన్నిటిలోనూ నిదానం గొప్పదని మీరే చెప్పారు కదా.

గవరయ్య: శాస్త్రిగారూ! శెగటుబా మూలకి జరపండి.

నారా: రామారావూ! రాజుని గుఱ్ఱపెత్తు వేయించు. తరువాత మాట చూద్దాం.

వెంక: ఏమండోయి! ఏక గొడవ చేయకండి.

[రామారావు గుఱ్ఱపెత్తు వెయ్యబోయి తీసినచోట నేయుంచి మళ్లీ ఆలోచించుచుండును]

వెంక: యేమయ్యోయ్! గుఱ్ఱాన్ని కదిపి తీరాలి. వెయ్యని ఎత్తినతరువాత మానేస్తే నే ఒప్పుకోను. అన్నింటికి మీ యిష్టమేనా ఏమిటీ! యీ ఆటకి నిబంధనలంటూ వున్నాయా, లేవా?

రామా: శాస్త్రిగారూ! జంతువుమీద చెయ్యివేసిన తరువాత కదిపితీరాలనే నిబంధన ఒకటి వుందన్నమాటే?

వెంక: లేకపోతే, వేళాకోళమా?

రామారావు: [నారాయణరావుతో] "శాస్త్రీజీ బడే ఖిలాడీ హై" అంటాడు.

వెంక: (అహంకారంతో) నేను ఖిలాడీనా నీకు? నువ్వెవరవూ నేను ఖిలాడీనైతే? తాగుబోతువా, పొగరుబోతువా?

(48-వ పేజీ చూడండి)



# జీవగర్రలు

ఆ కూర్చున్నది నేనే కానీ యింకా అనుమానంగానే ఉంది నేనని చెప్పటానికి ధైర్యం చాలటంలా ఏం? ఎక్కడున్నాను? ఏంచేశాను? ఏం చేస్తున్నాను? అసలు నేనే అంటారా కాదంటారా? అహా పోనీ మీరు చెప్పండి చూద్దాం నేనే అయిఉంటానులెండి నేను 'నేను' కాకపోతే యిక్కడెందుకుంటాను చచ్చి చెడి యీ నిర్ధారణకు మాత్రం రావడం జరిగింది 'ఆ కూర్చున్నది నేనే అని.' అలాగైతే నాచుట్టూ ఉన్న 'నేను' లన్నీ కూడా యిలాటి నిర్ధారణకే వచ్చితీరాలి రావడం జరగాలి ఇది ముమ్మాటికీ నిశ్చయం

అసలు యింతకీ యీ అనుమానం ఎందుకు రావాలి? ఈ అనుమానం నా కొక్కడికే వచ్చిందా? నా శరీరారోగ్యం విషయంలో ఏం తేడా పాడాగా లేదే. "ఏమండీ ఏం వంట్లో బాగోలేదా" అన్న ప్రశ్న నన్నెవ్వరూ వెయ్యలేదే! అక్కడ రోజూ కలుసుకుని, ఒకళ్ళనొకళ్లం చూసుకొని పలకరించుకునే వాళ్లం ఆడా మగా అమాంబాపతు 60 మంది ఉంటాము "అలాగున్నా రేమండీ" అని గాని "ఏమండోయి మీరు మీరులాగా లేరే" అని గాని అన్నవారు ఒక్క ఆడగాని మగగాని లేకపోయె మరి దీని తస్సాదియ్యా ఈ అనుమానం నాకే ఎందుకు వచ్చిందో తెలియకుండా ఉంది

ఆ నాలుగు గోడలమధ్యా సర్దుకున్న వాళ్లం మేము అరవైమందీను. రోజూ గోడ గడియారం 'టాంగ్' మని పదకొండు కొట్టేసరికల్లా అక్కడ హాజరుకావాలి. ఎక్కడ కొంపలంటుకున్నా, ఎక్కడ గోడలు కూలినా, చివరికి మా కొంపలోనే ఏదో అఘాయిత్యం వచ్చి పడిందన్నా సరే ఆఫీసు గడియారం అయిదు కొడితేనే గాని అరంగుళమైనా ఆ కూర్చున్న కుర్చీ లోంచి కదలడానికివీలు లేదు ఒకనాటితో పోయేదా ఏమన్నానా నిత్యం వచ్చే వాడికి ఏడిచేవాడెవడు. ఏదో కొట్టుకు వస్తున్నాను. కాలం ఖర్మంగాలి ఏదో యీ దిక్కుమాలిన ఆఫీసులో గుమాస్తాగా చేరి, ఆ హోరాత్రాలు ఏళ్లతరబడి చేస్తూ అలాగే ఎదుగూ బొదుగూ లేకుండా ఉండిపోయానుగాని నేనూ F A అయినవాణ్నే వెనక

ప్రతీవాడూ కబుర్లు చెప్పేవాడే గాని క్రియచూపే వాడొక్కడూ కనబడడు దేశంలో పలుకుబడుందనుకున్న ప్రతీ వ్యక్తీ వస్తూండటం, ఏ తోటలోనో దొడ్లోనో ఒక్కొక్క మీటింగు పెడుతూ ఉండటం, దేశం వాళ్ళమీద ఆధారపడి ఉంది అంటే వాళ్ళమీద ఆధారపడిఉంది అని ఎవరికి పెట్టిన మీటింగులో వాళ్ళను కాస్సేపు ఉబ్బేసి తన పని తను చేసుకుపోతూండడం "మీ కష్టాలేమిటయ్యా" అని కనుక్కున్న పెద్దమనిషి ఒక్కడూ కనపడడాయె 'పదిరూపాయలు జీతం పెంచండయ్యా చస్తున్నాము' అని నెత్తీ నోరూ మొత్తుకుని అధికారి అన్న ప్రతీవాడి చెవినీ నోరెట్టుకుని అరుస్తూంటే ఒకడైనా విన్నాడా, పాడా వెధవగొర్రెతోకకి ఎదుగూ లేదు బొదుగూ లేదన్నట్టు అలాగే ఉంచెవలసి వస్తూంది పైగా దేశానికంతకీ మా N G O 'పట్టుకొమ్మలని' ప్లాటుఫారాలమీద దంచుతూ ఉంటారు

ఏది ఎలాగున్నా జరిగేపనులు తప్పవతాయా మరి! మొగుడ్రాళ్ళిద్దరికీ చదువులు తప్పవుకదా దేవుడిదయవల్ల చంటిదాని కింకా గొడవలేదు ఏదో నాలుగు గోను గుడ్డలు కట్టిస్తే వదిలిపోయె అదృష్టవశాత్తూ భగవంతుడు నన్ను దయదలిచినాకు సంతానాన్ని జోరుగా ప్రసాదించలేదుగాని చచ్చేవాడ్ని. మా పెద్దాడికి ఏదో పదేళ్లు ముద్దికిందకి వచ్చేయున్నమాటేగాని ఎందుకూ ఆస్కారం లేదు ఎదురుగుండా వీధిలో ఉన్న కొట్టుమీదికి వెళ్ళి కొబ్బరినూనె తేరా అంటే వాడికి చేతకాదు అయితే పాపం ఈ సాదక బాధకాలన్నీ పడటం మా ఆవిడకి తెలుసు పగలస్తమానం పదిగొండునుంచి అయిదుదాకా ఆఫీసులో కొట్టుకుంటూనే ఉంటారు ఇహ పొద్దున్న సాయంత్రం ఆయస్నేం చంపనని, పక్కింటివారి బంట్రోతువాడ్ని బతిమాలి యింటి చాకిరీ అంతా చేయిస్తూనే ఉంటుంది బతికేనురా బాబూ

అయితే ఏమిటి ఉపయోగం పదేళ్ళబట్టి కూర్చున్న కుర్చీలోనే కూర్చున్నానాయె ఈ దరిద్రపు ఆఫీసులో మా పెద్దాడు పుట్టినప్పుడు కాలెట్టేను అప్పుడెలా ఉన్నానో యిప్పుడూ అంతే ఆ కుర్చీకీ నాకూ ఈ వెధవ అవినాభావసంబంధం ఏమిటో, స్పర్శ జ్ఞానం సగం చచ్చింది కుర్చీ చెయ్యిమీద చెయ్యి వేసినా ఒంటిమీదే వేసుకున్నాననుకోవడం దురదెట్టినా నాకో లేగదా అని ఆ కుర్చీని గోకెయ్యడం యిలాటి ఎన్నో, ఆ కర్రతత్వం మనకీ మనతత్వం ఆ కర్రకీ ఎంతో కొంత కలిసిఉండాలి అలాగ కాకపోతే నన్ని ఆ కుర్చీని గోకడం ఎందుకు జరుగుతుంది? మొదట్లో వేసినప్పుడు గట్టిగా ఉన్న కర్రకుర్చీ యిప్పుడెందుకు మెత్తపడుతుంది?

సాయంకాలం ఆఫీసునుంచి లేటుగా యింటికి వచ్చాను కాస్త పెంద్రాళే $7\frac{1}{2}$ అయేసరికల్లా భోజనంచేసి పడకకుర్చీలో కూలబడ్డాను మా పెద్దాడేదో పుస్తకంతీసి చదువుకుంటూ కంగారుగా నాదగ్గరికి వచ్చి "నాన్నా నాన్నా జీవంగలకర్ర లెక్కడన్నా ఉంటాయా? ఈ పుస్తకంలో జీవగర్రలని వ్రాసుంది" అని అమాయకంగా తను జీవంగల కర్రల నెప్పుడూ చూడలేదనే అనుమానంతో అడిగాడు మా కుర్రాడిని 'జీవగర్ర' అంటే 'పట్టుకొమ్మ" అనీ, అంటే 'వెన్నెముక' వంటిదని ఏదో అర్థం చెప్పివాడ్ని పంపేశాను.

నాకు పాతబడ్డవాక్యం ఒకటి గుర్తుకువచ్చిది "The Wood entered into my soul" అని అంటే కర్ర నా ఆత్మలో ప్రవేశించిందని ఒక్కసారిగా నాకు జీవముగల కర్రలూ, కర్రజీవాలూ ఉంటాయన్న ఆలోచన కలిగింది నమ్మకం కుదిరింది దేశానికంతకీనూ N G O లే "పట్టుకొమ్మలు" జీవగర్రలు జీవముగల కర్రలు కర్రజీవాలు యింక జీవగర్ర అంటే నేనే నేనుకాదని సందేహించవలసిన అవసరమేముంది? నిస్సందేహంగా ముమ్మాటికీ నేనే జీవగర్రను రాత్రి ఎలాగో నిద్రపట్టింది

తెల్లవారింది పదకొండయింది. మామూలుగా ఆఫీసుకుర్చీలో కూర్చున్నా. సాయంకాలం అవుతూవుంది—నాకు సందేహం వచ్చింది: ఆ కూర్చున్నది 'నేనేనా' అని ★

శ్రీ రా. సీ. రామచంద్రరావు

# కోర్టుకెరాని సాక్ష్యాలు

ఆశ్చర్యం !!

జడ్జీగారికి చెప్పలేనంత ఆశ్చర్యంగా ఉన్నాది.

"అది నా భార్య
అగ్నిసాక్షిగా పెళ్లాడేను దాన్ని
అది నాదగ్గరకి రావాలి
నాతో ఉండాలి"

అంటాడు ఒక ఆసామీ.

అదీ అతని కేసు.

అతనే వాది ఆ కేసులో

నల్లగా, పల్చగా, పొడుగ్గా ఉన్నాడతను

నల్లగా, పొడవుగా పీచురేగిన జుత్తు అతన్ది

నల్లగా, సన్నగా, పొడవైన మీసాలు అతనివి

నడివయసులో, బలిష్ఠంగా ఉన్నాడతను

పుట్టింది లగాయితు నేటివరకూ నవ్వినట్టులేని ముఖం అతన్ది

పైన వేసుకున్నది ఏరంగో తెలియని షర్టు

కాళ్లమీద జీరాడుతున్నది చిరిగిన పైజామా

"నేను వాణ్ణి పెళ్లాడలేదు
నేను వాడి పెళ్లాన్ని కాను
నేను వాడిదగ్గరికి వెళ్ళనవసరం లేదు
వెళ్లను"

అంటుంది ఆమె

అదీ ఆమె జవాబు

ఆవిడే ప్రతివాది ఆ కేసులో

తెల్లగా, లావుగా, పొట్టిగా ఉన్నదావిడ

నల్లగా వంకులు తిరిగిన జుత్తు ఆమెది

యవ్వనంతో, అందంతో పొంగరెక్కిన ముఖం ఆమెది

తెల్లటి చీర కట్టుకుంది

నల్లటి రవిక వేసుకొంది

కొప్పులో ఎర్రగన్నేరుపూలు పెట్టుకొంది

ఇద్దరూ చెరోవైపూ నిల్చున్నారు

కాస్త ఎడంగా, మధ్యగా, ఎత్తుగా, కుర్చీలో కూర్చున్న వారే జడ్జీగారు

"ఎందుకు పెళ్లాడేనా దీన్ని" అని వాపోతూ ఉంటారు జడ్జిగారు, తన పెళ్లాం తలపుకొచ్చినప్పుడల్లా

ఆవిడ ఎప్పుడూ తలపుకి వస్తూనే ఉంటుందాయనకి

"పెళ్లాడకపోతే ఎంత బావుణ్ను!
ఎంత హాయిగా ఉందును!"

అని విలపిస్తూ ఉంటాడాయన

పెళ్లాం అనే పీడ ఎంత వేగిరం వదిల్తే అంత మంచిదనే నిశ్చితాభిప్రాయానికి చాలాకాలం క్రితం వచ్చేరు జడ్జీగారు వచ్చేటు చేసింది ఆయన భార్య

## "కాంతా కాంత"

ఇప్పటికీ ఆ అభిప్రాయమే జడ్జీగారిది పెళ్లాం అంటే సైతాన్ జడ్జీగారి నిఘంటువులో

రానంటూన్న సైతాన్ని రాకపోతే వీల్లేదనే వాదిని చూసి "మెంటల్" గా మనస్సులోనే ముక్కుమీద వేలేసుకున్నారు జడ్జీగారు

"రాను మొర్రో అంటూవుంటే దాన్ని రమ్మంటా వేమిట్రా" అని అడిగేరు కూడా వాదిని

"అగ్నిసాక్షిగా కట్టుకున్నది రాకేం చేస్తుందండి" అన్నాడా వాది

"రాకపోతే పోతుంది నీకెందుకా బాధ?" అన్నారు జడ్జీగారు విసుగుతో

"నా కొ్కకపోతే బాధ మరెవరి కండి? అగ్నిసాక్షిగా నాచేత పుస్తె కట్టించుకున్న ముండాకూతురు రానని కూర్చుందాయను రకపోతే ఏం పోయిందని తమరు సెలవిస్తున్నా రాయను తమరి సొమ్మేం పోయిందండి"

అని కేకలువేసే వాదిని "తగ్గవోయ్, తగ్గు, ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసునా" అంటూ హెచ్చరించేడు బెంచి గుమాస్తా

అంతవరకూ నవ్వుతూ హుషార్‌గా చూస్తున్న వాది వకీలు అప్పుడు కొంచెం తెలివి తెచ్చుకొని "నువ్వు నోరుముయ్యరా" అంటూ వాదిని కసిరేడు

వరాండాలో జవాను "సైలెన్స్, సైలెన్స్" అని అరిచేడు

ఒక్కక్షణం ఆగేడు వాది

ఆగి తిరిగి ఆరంభించబోయాడేదో

కాని ఆరంభించిందీ లోపునే ప్రతివాది, జోరుగా జడ్జీగారి వైపు తిరిగి

"బాబూ, తమరాలకిస్తున్నారా? ముండాకూతురని ఎలా తిడుతున్నాడో"— వాదివైపు తిరిగి—"చచ్చినాడా, ఎవర్రా నువ్వు? ఎవరైనా ముండని చేస్తావు? దొంగ చచ్చినాడా! ఎప్పుడ్రా పెళ్లాడేవు నువ్వు నన్ను ఏ అంట్లముండయినా నిన్ను పెళ్లాడుతుందిరా" అంటూ చాలా జోరుచేసింది ప్రతివాది

"ఆగవమ్మా, ఆగు" అంటూ గాభరాలో కేక లేసేడు బెంచి గుమాస్తా

"మొగాడివైతే వాణ్ణి అదమాయించవయ్యా ఆడదానిమీద కేక లేస్తున్నావు! సిగ్గయినా లేదు వాడందర్నీ ముండల్ని చేసి నోటికొచ్చినట్టు పబ్లిగ్గా కూస్తా ఉంటే నన్నాగమంటా వేమిటి?" అంటూ సాగదీసింది ప్రతివాది

"పొగర్లావయిందండి దొంగముండకి" అన్నాడు వాది కోర్టు వారివైపు తిరిగి

"ఆహా ఎంత ముచ్చటగా తిట్టేడు" అనుకున్నారు జడ్జీగారు మనసులో ఒక్కసారి ముచ్చటకైనా తిట్టలేదు జడ్జీగారు తన భార్యని నేటివరకూ

"ఇది చాలా ఘోరం! చాలా అన్యాయం! చాలా దౌర్జన్యం! పబ్లికు కోర్టులో ఊరుకోడం భావ్యంగా లేదు నాకు" అంటు

ఆపెద్ది. ఆడదాన్ని ఇలా తిట్టడమా! అందులోనూ ఇటువంటి అమాయకురాల్ని అసహాయురాల్ని తిట్టడమా! వాది దురాగ్గాన్ని కోర్టువారు సహించ కూడదు..." అని హఠాత్తుగా లేచి ఏదేదో చెప్పి ఇంకా ఏదో చెప్పబోతున్న తన వకీలువైపు చురచుర చూస్తూ అడిగింది ప్రతివాది.

"ఇంతసేపూ వాడలా తిడుతూ ఉంటే ఎందుకయ్యా ముంగిలా కూర్చున్నావు? ఇప్పుడా వచ్చింది తెలివి?" ప్రతివాది అడిగిన ప్రశ్నకి కోర్టువారు పెదవులు కదల్చేరు. బెంచిగుమాస్తా ముసిముసిగా నవ్వేడు. మిగతా ప్లీడర్లూ, ప్లీడరు గుమాస్తాలూ పొట్టల్చెక్కలయేలా నవ్వేరు.

మొత్తానికి, ప్రతివాదీ, ఆమె వకీలూ తప్ప, అంతా సంతోషించేరు. "ఓ! ఏం నవ్వుతున్నారయ్యా అంటారు! మీ ఆడవాళ్లినలా తిడితే ఇలాగే నవ్వుతారు గాబోలు...నవ్వడం కాదు బాబూ, నవ్వడం కాదు ఇక్కడెవడయినా మొగవాడన్న వాడుంటే వాడికి చమ్డా లెగరగొట్టవల్సింది" అని అందర్నీ మందలించి ఛాలెంజి చేసింది ప్రతివాది. వాడికి చమ్డా లెగరగొట్టి, ఆవిధంగా తమ మొగతనం నిరూపించుకోందికి ఎవ్వరూ సిద్ధపడలేదు.

సిద్ధపడక పోడం సరికదా ప్రతివాదిని అదమాయించేరు.

దాన్తో ఆవిడ రాగం మొదలు పెట్టింది.
ఆవిడ ఏడ్పుకి కోర్టుహాలు దద్దరిల్లింది.
జడ్జీగారు కంగారు పడ్డారు.
ప్లీడర్లు కనుబొమ్మ లెగరవేసేరు.
గుమాస్తాలు ఆవిడకి కళ్లు అప్పజెప్పేరు.
టిక్కట్టు కొనకండా సినీమా చూసినట్లు కోర్టు కొచ్చిన జనం ఈదృశ్యం చూసి సంతోషించేరు.

*"Under these Circumstances I pray for an adjournment"* అన్నాడు ప్రతివాది వకీలు.

వాది వకీలు వీల్లేదన్నాడు.

వీలవు తుందన్నారు జడ్జీగారు.

ఆ నాటికి వాయిదా వేసి "అమ్మయ్య!" అనుకున్నారు జడ్జీగారు.

పదే పదే వాయిదాలు పడితే కొంతమంది పార్టీలు ఖర్చులు భరించలేక రాజీ చేసుకుంటారు. అయితే, కొంతమంది పార్టీలు కేసుని అంత సులభంగా చంపెయ్యరు. కోర్టుని అంత సులభంగా విడిచి పెట్టరు.

"దాన్ని చస్తే వదిలిపెట్టను. అది నా పెళ్లాం, నాదగ్గరకి రావల్సిందే" అని ఈ కేసులో వాది పెళ్లాంకోసం కోర్టుని పట్టుకూర్చున్నాడు. పార్టీలు, ప్లీడర్లు, గుమాస్తాలు, సాక్షులు, మద్దత్తుదార్లు వగైరాలు కోర్టుకివచ్చి, ఇంటికిపోయి, తిరగ్గా తిరగ్గా కేసు విచారణకి వచ్చింది.

వాది బోనెక్కి సాక్ష్యం చెప్పేడు: ప్రతివాదిని అగ్ని సాక్షిగా పెళ్లాడేనన్నాడు. అప్పుడు చాలా మంది వచ్చి చూసి సంతోషించేరన్నాడు. ప్రతివాదికి బంగారం పెట్టేనన్నాడు. తను కట్నం పుచ్చుకో లేదన్నాడు. కొన్నాళ్లు హాయిగా కాపురం చేసేమన్నాడు. కాపురం చేస్తున్నప్పుడు ఫలానా, వారింట్లో అద్దెకుండే వారం అన్నాడు. అకారణంగా ఇప్పుడు తనని విడిచి పెట్టి వెళిపోయింది ప్రతివాది అన్నాడు. తన దగ్గరికి ఆవిడవచ్చి తీరవలసిందే అన్నాడు.

మొత్తంమీద సాక్ష్యం మాంచి కట్టుదిట్టంగా చెప్పేడు. క్రాసులో వేసిన డొంక తిరుగుడు ప్రశ్నలకి ధీమాగా జవాబు చెప్పేడు.

పెళ్లి చేయించాననే పౌరోహిత్యుడు, పెళ్లి చూశామనే పెద్ద మనుష్యులు, వాది ప్రతివాదులు తన ఇంట్లో కాపురం చేసేవారనే పెద్దమనిషి వగైరా వారంతా కూడా వాది తరఫున తొణక్కుండా బెణక్కుండా, తొట్రుపడకుండా, నీళ్లు నమలకుండా సాక్ష్యం చెప్పేరు.

వాది ప్రతివాదులకి అగ్నిసాక్షిగా పెళ్లయిందని గట్టి సాక్ష్యం వచ్చింది. తరువాత ప్రతివాది బోనెక్కి సాక్ష్యం చెప్పింది.

వాది తరఫు వచ్చిన సాక్షుల సాక్షిగా గాని, అగ్నిసాక్షిగా గాని, మరే దేవత, దెయ్యం సాక్షిగా గాని తనకి పెళ్లి కాలేదంటుం దావిడ. వాదితోనే కాదు, మరెవరితో కూడా తనకి పెళ్లి అవలేదంటుంది. వాదిని తనెప్పుడూ ఎరగనే ఎరగదట. ఈ కేసులో తప్ప ఇంతకు ముందెప్పుడూ చూడనే చూడలేదుట ఆవిడ. వాడితో తనెప్పుడూ కాపురం చెయ్య లేదంటుంది. తనని ఫలానా షావుకారు ఉంచుకొన్నాడన్నాది.

డిఫెన్సు సాక్షులు చెప్పే దేమంటే:

వారు ప్రతివాదిని చిన్నప్పట్నుంచీ ఎరుగుదురు. ఆవిడకి ఎన్నడూ ఎవరితోనూ పెళ్లి జరుగలేదు. పెళ్లి కావల్సిన అవసరం ఆవిడకి లేదు. ఆవిడకి ఈడు వచ్చినప్ప

ట్నుంచీ ఎవరో వకరు ఆవిణ్ణి ఉంచుకొంటూనే ఉన్నారు. ఏడాదినుండీ ఫలానా ఫలానా షావుకారు ఆవిణ్ణి ఉంచుకున్నాడు. షావుకారు పోషకవర్గంలో కులాసాగా కాలం గడుపుతూన్న ప్రతివాదికి, పూటకి టికాణా ఉన్నట్టు కనిపించని వాదిని పెళ్లాడవలసిన అవసరం లేదు. ఆవిడ ప్రస్తుతం గర్భవతిగా ఉండడం షావుకారు "అనుభవం"లో ఉండగా అయింది గాని వాదితో కాపురం చేస్తున్నప్పుడు కాదు. ఈ రీతిగా ప్రతివాది తరఫు సాక్ష్యం నడిచింది.

అయితే ఆ షావుకార్ని సాక్షిగా ఎందుకు రప్పించలేదు ప్రతివాది?

షావుకారు గారు ఇంగ్లాండు వెళ్ళేరు. అక్కడనుంచి అమెరికా వెళ్తారు. ఎప్పుడు వస్తారో తెలియదు. ఆయన్ని కమీషన్ మీద విచారణ చేయించడానికి ప్రతివాది దగ్గర అంత డబ్బు లేదు.

సాక్షి విదేశాలన్నీ చూసుకొని వచ్చేదాకా కోర్టు కనిపెట్టుకొని కూర్చుందికి వీల్లేదు.

దావాని, ఆఖరికి, కోర్టువారు విచారణ చేసేరు.

సాక్ష్యం అంతా విన్నారు.
ఆర్గ్యుమెంట్లు విన్నారు.
"కేస్ లా" చదివేరు.
తదుపరి, తీరుబడిగా తీర్పు చెప్పేరు.

కోర్టువారు సుదీర్ఘంగా చెప్పిన తీర్పులో తెలుసుకోవల్సిన ముఖ్య విషయా లివి :—

కేసు : ప్రతివాది తన భార్య అనిన్నీ, దావా తేదీకి నెలదినములముందు తనని ప్రతివాది అకారణంగా విడిచిపెట్టి వెళిపోయిందనిన్ని, ఆమె తన వద్దకి రావలసిందనిన్ని వాది దావా తెచ్చేడు.

తనకీ వాదికీ పెళ్ళికాలేదనిన్నీ, తను అవివాహితననిన్నీ వాది ఎవరో తనకు తెలియదనిన్నీ, వాడి వద్దకు తను వెళ్ళనవసరం లేదనిన్నీ ప్రతివాది జవాబు చెప్పింది.

సారాంశములు : వాది ప్రతివాదులకు వివాహం అయినదా ? వాదిని ప్రతివాది అకారణంగా విడిచిపెట్టినదా ? ఏ పరిహారమునకు వాది అర్హుడైయున్నాడు ?

సాక్ష్యం : వాది ప్రతివాదిని అగ్నిసాక్షిగా పెళ్లాడినట్లు వాది చెప్పడమే కాకుండా చాలామంది ఆ విషయంగురించి చెప్పేరు. వారిలో ఎవర్నీ కూడా "క్రాస్"లో "షేక్" చెయ్యలేకపోయాడు ప్రతివాది వకీలు. వాదిప్రతివాదులు కాపురం చేస్తూండగానే ప్రతివాది గర్భవతి అయినట్టు అంతమంది సాక్షులూ చెప్పేరు. పెండ్లికాలమందే కాక గర్భాధాన కాలమందు కూడా తనే పురోహితుణ్ణని చెప్పేడు రెండవసాక్షి.

ప్రతివాది తన సాక్ష్యంలో తను అవివాహితనని చెప్పింది. మిగతా ఆమె సాక్షులు కూడా ఆవిధంగానే అన్నారు. ఆవిణ్ణి ఎవరో ఉంచుకున్నారు అని చెప్పేరు. ఉంచుకున్న వాడెవడూ సాక్షిగా రాలేదు.

"పెళ్ళిఅయింది" అనే *positive fact* గురించి వాది తరఫున గట్టి సాక్ష్యం వచ్చింది. "పెళ్ళికాలేదు" అనే *Negative fact* గురించి సరియైన సాక్ష్యం లేదు. ప్రతివాది ఏరాత్రి ఏగుళ్ళో పెళ్ళిచేసుకుందో తెలుసుకునేందుకు ఆమెని ఆమె సాక్షులు ఇరవైనాలుగ్గంటలూ అంటిపెట్టుకు తిరగరుకదా! అదీగాక, లోకంలో ఇంతమంది ఆడవాళ్లుండగా వాది ఈ ప్రతివాదినే పెళ్ళిచేసుకొన్నానని ఎందుకనాలి ?—నిజంగా పెళ్ళాడితేనే తప్ప. అన్నింటిబట్టీ చూస్తే వాది ప్రతివాదులకు అగ్నిసాక్షిగా వివాహం జరిగిందని ఈ కేసులో ఋజువయినట్టు కనిపిస్తోంది. వాదిని విడిచి రావడానికి తగినంత కారణం ప్రతివాది చూపలేదు.

కాబట్టి, వాది ప్రతివాదులకు శాస్త్రసమ్మతంగా వివాహం జరిగిందని *Declare* చేయించుతూ, ప్రతివాది ఈ వెంటనే వాదితో తిరిగి కాపురానికి వెళ్ళవలసిందని డిక్రీ ఇవ్వబడును.

పార్టీలు ఎవరి ఖర్చులు వారే భరించవలెను.

తీర్పు తెలుసుకున్న తరువాత ప్రతివాది బండబూతులు తిట్టింది, కేసుకి సంబంధించిన వారి నందర్నీ.

కేసు అయిన తరువాత ఫలానా ఫలానా షావుకారు గారికి వాది ఒక జాబురాసేడు. ఈ కథకి సంబంధించిన భోగట్టా ఇది :

"...కేసు పూర్తయింది. దాన్ని నేను అగ్నిసాక్షిగా పెళ్లాడినట్టు, అది నా దగ్గరకి వచ్చి నాతో కాపురం చెయ్యవలసినట్టు తీర్పు చెప్పేరు. ఇహ నా ముండ (!) వల్ల మీ కేమీ ఫర్వాలేదు...అయితే ఇక నేను మీరు చెప్పినట్టుగా..." కేసు అయిన పిమ్మట వాది ఎక్కడికిపోయినదీ ఎవరికీ తెలియదు.

ప్రతివాది గోలుగోలున ఏడ్చింది.

షావుకారువచ్చి సాక్ష్యం చెప్తే ఎంత బావుణ్ను అనుకుం దామె.

ఆమెని ఉంచుకున్నానని చెప్పడానికి సాక్ష్యానికి షావుకారు రాలేదు.

తన సాక్షిగా పెళ్ళవలేదనడానికి, అగ్నిదేవుడు రాలేదు. ★

# రెండు మహానగరాలు

(7-వ పేజీ తరువాయి)

దోవను నడుస్తున్నట్టు అనుమానంగా వుంటోంది. ఆ వ్యవహారాలను దోవను తేవాలనే ఉద్దేశంతో వాళ్ళల్లో ముగ్గురు 'కన్వర్షనిస్టుల' (ఆందోళనపరుల) ముఠాలో జేరి పనిచేస్తున్నారు. వాళ్లు ముగ్గురూ అక్కడ కూర్చుని 'నురుగులు గక్కుదామా, జుట్టు పీకేసుకుందామా, గర్జించేద్దామా' అని ఆలోచిస్తున్నారు అల్లాంటి అపస్మారగుణాలు కనబరిస్తే, ఆ దొడ్డప్రభువుకు కొంచెం హెచ్చరికగా వుంటుందని ఆ అమాయకుల అవివేకం. ఈ గణాచారులు ముగ్గురూ కాక, అక్కడున్న మిగతా ముగ్గురూ అదో ప్రత్యేకవ్యవస్థకు చెందినవాళ్లు. సత్యాన్వేషుల ముఠా! సత్యాన్వేషణపైన ఒక గంభీరోపన్యాసం దంచిపారేస్తే జగత్తు మరమ్మతై పూరుకుంటుందని వాళ్ల ఉద్దేశం; మానవుడు సత్యం యొక్క సమ్యక్ కేంద్రంలో పుట్టాడు; ఇంతవరకూ సత్యంయొక్క పరిధిని దాటి వెళ్లలేదు. పరిధిని అతిక్రమించి బయటికి యెగిరిపోకుండా మానవుణ్ణి అట కాయించాలి. అట కాయించటమే గాదు మెడబట్టి మళ్ళా కేంద్రంలోకి గెంటాలి. ఇలా గెంటటానికి సాధనాలు నిరశనవ్రతాలూ, భూతప్రేతాది అశరీరాగులదర్శనం!

ఈసిద్ధాంతాలను పురస్కరించుకుని వీళ్ళుముగ్గురూ, అశరీరులనుగురించి అఖండంగా వాదప్రతివాదాలు నడిపారు; ఆ ఆధ్యాత్మిక మీమాంసవల్ల ఏదో అఖండమైన మేలే జరిగివుంటుంది. కాని ఆ జరిగిన మేలేమిటో దాని తుండం కాకపోతే మానె, తోకైనా మన కెక్కడా కనుపించదు.

అయితే ఆ విందుసందర్భాలలో మెచ్చదగిన విషయం ఒకటి వుంది. ప్రతిఒక్కరూ చూడ సొంపైన వేషభూషలు ధరించి వుంటారు. క్రీస్తుచెప్పిన 'జడ్జిమెంటుదినం' గనక భూషణాంబరధారణ దినమైతే వాళ్లందరూ అందుకు సర్వథా సంసిద్ధులై వున్నారనే అనుకోవచ్చు. ముఖాలకు పులుముకున్న ఆ మెరుగు పూతలూ, ఆ పౌడర్లూ, కొమ్ములు కొమ్ములుగా పైకి దువ్వి నిలబెట్టిన ఆ తలకట్లు, ఆవీర ఖడ్గాల తళతళలు, ఆ అత్తరు పరిమళాలూ, ఆ విలాస విభ్రమాలు అలా యెంతకాలం సాగితేమాత్రం, విసుకేమిటి? గొప్పవంశాల పెద్దమనుషుల మెళ్ళల్లో వ్రేలాడే బంగారుగొలుసులు వాళ్లు అటు ఇటూ మసలినప్పుడల్లా చిరుగంటల్లా మోగుతై. ఆ చిరుగంటల మోతలేమి సిల్కువస్త్రాల గరగరలేమి ఇంకా ఇతర విలాసభాషలేమి గాలిలో వ్యాపించుతూ సెయింట్ ఆంటొనీనీ, ఆయన ఆకలిఘోషనూ కూడా అంతూపంతూ లేకుండా అవతలికి కొట్టేస్తున్నయ్.

'డ్రెస్'లో చాలా మహత్యంవుంది. ఎవణ్ణి ఎక్కడ వుంచాలో వాణ్ణి అక్కడ వుంచుతుంది. ఈ ప్రపంచం ఒక పగటివేషాలవినోదం; అంతఃపురాలలో వేసేవేషాలు వేరు, రాజదర్బారులో వేసే వేషాలు వేరు, జడ్జీలవేషాలు వేరు, ఉరిదీసేవాడి వేషం వేరు.

ప్రభువుగారు చాకొలెట్ త్రాగటం ముగించి, ఆ నలుగురు సేవకులకూ విరామం ఇచ్చారు. అనంతరం బయటి గదులలో వేచివున్న భక్తకోటికి దర్శనమిచ్చి తరింపజేసే పరిపూర్ణకటాక్షంతో పవిత్రాతిపవిత్రమైన ఆ గర్భగుడితలుపులు తెరువవలసిందిగా ఆజ్ఞాపించినవారై, సేవకవితతి అడుగులకు మడుగులొత్తి బరాబరులు పచరించుతూ వుండగా బయటికి విచ్చేశారు. ఆ దివ్యదర్శనంతో, అంజలి ఘటించేవారే కాదు, ఆనతులు పచరించేవారే గాదు, ప్రాణాచారాలు పడేవారే కాదు, ఓహో హో! యేమి భక్తి, యేమి ప్రపత్తి, యేమిదాసభావం—ఎంత మహోత్కృష్టమైన బానిసత్వం!— బహుశా ఈ ప్రత్యక్షదైవాన్ని ఉపాసించి తరించుతున్నారు గనకనే ఆ భక్తకోటి స్వర్గంలో యెక్కడో వున్న 'ఆ పాతదేవుణ్ణి మరిచిపోయి వుంటారు.

ఇక శ్రీ వారు, ఒక చిరునవ్వుతో ఇక్కడో భక్తుణ్ణి తరింపజేయటం, ఒక్క మధుర వాక్కుతో అక్కడో పుణ్యపురుషుణ్ణి ఆనందభరితుణ్ణి చెయ్యటం, కెంగేలిస్పర్శతో మరోపతితుణ్ణిపావనం చెయ్యటం, ఇలా సమస్తమైనవారినీ ఆనందింపజేస్తూ చిట్టచివరి గదిలోవున్న 'సత్యపరిధి'వరకూ వెళ్ళారు. అక్కడనుంచి మళ్ళా వెనక్కు తిరిగి కక్ష్యాంతరములు గడిచి నిజనివాసమైన గర్భగుడిలో ప్రవేశించి నౌకర్లచేత తలుపులు మూయించి అదృశ్యమైపోయారు.

ఈ ప్రదర్శనం ముగియగానే, ఆ మందిరంలోని వాతావరణమంతా కోలాహలమై చిన్నితుపాను రేగినట్టయింది. బంగారు గొలుసుల జిలుగురావాలు మెట్లమీదినుంచి క్రిందికి దిగిపోతున్నయ్. క్షణంలో ఆ మందిరంలో వున్న యావన్మందీ బయటికి వెళ్లిపోయారు. చివరకు మిగిలిందల్లా ఒకే ఒక వ్యక్తి; చేతిలో పొడుండబ్బి, చంకలో టోపీ, ఆ వ్యక్తి నిలువుటద్దాలమధ్యగా బడి బయటికి వెడుతూ, సింహద్వారం దాకా వెళ్లి, ఒక్కసారి యిలా వెనక్కు సింహావలోకనం చేసి గర్భగుడివంక చూసి పళ్ళు పటపటా కొరికి: 'నిన్నురా! సైతానుకు బలిబెడతా!' ననుకున్నాడు. వ్రేళ్ళనున్న పొడుంపట్టు కాళ్ళకంటుకున్న దుమ్ము దులిపేసుకున్నట్టు కచ్చగా దులిపేసుకుని, మళ్లా శాంతపడి నెమ్మదిగా మెట్లు దిగి క్రిందికి వెళ్లిపోయాడు.

ఆయనకు దాదాపు అరవై సంవత్సరాలవరకూ వయస్సుంటుంది. ముఖానికి యేదో తొడుగు వేసుకున్నట్టు, ఆ ముఖంమీద యెప్పుడు చూచినా ఒకేరకమైన భావరేఖ. ముక్కుకూడా పొంకంగానే అమరివుంది. కాని రెండు ముక్కుకోళ్ల దగ్గరా కుంచెం మెలివున్నట్టు వుంటుంది. ఆయనలో యే ఆవేశం ఉదయించినా అది, ఆ ముక్కుకోళ్లు విచ్చులుకోవటంలోనూ ముడుచుకోవటంలోనూ ద్యోతమానం అవుతుంది. కుట్ర, క్రూరత్వమూ యావత్తు స్వభావాలూ ఆ ముక్కుకోళ్లమీద పొటమరించి, యావత్తుస్వరూపానికి ఆ భావావేశరేఖలను ప్రసరించుతై. అలాంటి భావావేశం యేదైనా పొటమరించినప్పుడు, జాగ్రత్తగా పరిశీలించితే వాటి ఛాయలు పెదవుల వంపులోనూ కనుబొమల కదలికలోనూ కూడా కనుపించుతై.

ఆయన మెట్లు దిగి క్రిందికి వెళ్లి వాకిట్లో తనకోసం నిలిపివున్న గుర్రపుబగ్గీలో పోయి కూర్చున్నాడు. కోచ్‌వాలాను 'పోనీ' మని ఆజ్ఞాపించాడు. ఆ విందులో ఆయనతో యెవ్వరూ ఎక్కువ మాట్లాడలేదు. తాను ఒకమూల యెక్కడో ఒదిగి నిల్చున్నాడు. ఆయన అభిమానం దెబ్బతిని మొఖాన గొంటుబెట్టుకున్నాడు. ఆ పరిస్థితిలో ఆయన గుర్రబ్బండి బయలుదేరేముందే, వీధిలోవున్న జనం కాస్త అటూఇటూ తప్పుకుంటే బాగుండేది. ఏదో శత్రువును తురుముకుపోతున్నట్టు కోచ్‌వాలా గుర్రాల్ని యిష్టమొచ్చినట్టు తోలేస్తున్నాడు. వాడి అఘాయిత్యం చూస్తూ కూడా యజమాని ముఖంలో యే మార్పూ రాలేదు. అవి మూగరోజులా చెవిటి నగరం అన్నమాట కూడా నిజమే: అయినా నిరసన వాక్యాలు వినిపించుతూనే వున్నయ్. పిల్లా జల్లా వున్న అల్లాంటి యిరుకు సందుల్లో పిల్లా జల్లని నలగ దొక్కించుతూ అంత అఘాయిత్యంగా గుర్రాల్ని తోలటం కిరాతమని మానవ కంఠాలు అరుస్తూనే వున్నయ్. అరుస్తేమాత్రం లాభమేమిటి? ఆ నాటుజనం తమ కష్టాలలోనుంచి బయటపడేమార్గమేమిటో తామే చూసుకోవాలిగాని వాళ్ళ ఘోషవినేదెవరు?

బండిచక్రాలు చక్రబాణాల్లా గిర్రు గిర్రున తిరిగి పోతు

న్నయ్. బండి రివ్వు రివ్వున మలుపులు తిరిగిపోతోంది. ఆడవాళ్లు హా హా కారాలుచేస్తూ బండిక్రింద పడబోతున్న బిడ్డల్ని అమాంతం ముందు కురికి అవతలికి లాక్కుపోతున్నారు. బండి ఇలా వాయువేగంగా పోతూ పోతూ ఒకచోట చివాల్న మలుపు తిరిగింది. బండి చక్రం ఉవ్వెత్తుగా పైకి లేచి దభీమని కుదబడ్డది. 'అమ్మో!' అన్న ఆర్తనాదం వెయ్యికంఠాలనుంచి ఒక్కసారి వినిపించింది. గుర్రాలు ముందుకు కుదబడ్డయ్.

అలాంటి యిబ్బంది జరక్కపోయినట్లయితే బహుశా బండి ఆగేదేగాదు. చచ్చినవాళ్ళని రోడ్డుమీద పారేసి యిన్ని బళ్ళు ముందుకు వెళ్లిపోవు? కాని గుర్రాలు ముందుకు కుదబడటంతో, కోచ్‌వాలా కంగారుపడి క్రిందికి ఉరికేశాడు. ఇరవైముప్ఫయిమంది వచ్చి గుర్రాల కళ్లాలు పుచ్చుకున్నారు.

కోచ్‌లోనుంచి, ఆ జమీందారు, నిమ్మకు నీరెత్తినట్టు అతి శాంతంగా బయటికి తొంగిచూచాడు: 'ఏయ్! ఏవిఁటది—ఏవిఁజరిగింది?'

గుడ్డటోపీ పెట్టుకున్న ఒక బారాటి మనిషి బండిచక్రాల క్రిందినుంచి నుజ్జునుజ్జయిపోయిన ఒక నెత్తురు ముద్దను బయటికి లాగి దాన్ని బుజానవేసుకొని ప్రక్కనున్న పేవుమెంటుమీదకు తీసుకెళ్లి పడేశాడు. ఆ నెత్తురు ముద్దమీద బోర్లబొక్కలుగాపడి, నెత్తీనోరూ బాదుకుంటూ, ఆకాశం అర్చుకుపోయేట్టు గొల్లుగొల్లున యేడ్చేస్తున్నాడు.

చింపిరిగుడ్డల్లో వున్న, నోట్లో నాలుక లేని, ఒక అమాయకుడు బండిదగ్గిరి కొచ్చాడు: 'ప్రభువులు రచ్చించండి. పసిబిడ్డ బండికింద పడ్డది' అన్నాడు.

'ఆ రొదచేస్తున్న వెధవెవడు—దాని తండ్రా యేవిఁటి?'

'చిత్తం రచ్చించండి బాబూ! ఆడి బిడ్డేనండి'

ఏడుస్తూ ఏడుస్తూ ఆ అభాగ్యుడు చివాల్న లేచి బండివేపు పరుగెత్తుకు కూర్చున్నాడు. జమీందారు బొడ్లోవున్న కత్తిపిడిమీదికి చెయ్యిపోనిచ్చాడు.

ఆవ్యక్తి దెబ్బతిన్న అడివి మృగంలా భీభత్సంగా అరిచాడు: 'చంపారు!—చచ్చింది!'

చుట్టూవున్న మనుషులు అతన్ని చుట్టేసి కదలకుండా పట్టుకుని దేబెముఖాలేసి జమీందారు వంక చూస్తున్నారు.

జమీందారుకు వాళ్ళముఖాలలో ఒక కచ్చగాని కోపంగాని వున్నట్టు కనుపించలేదు. వాళ్లందర్నీ కలుగుల్లోనుంచిబయటి వచ్చిన యెలుకల క్రింద జమకట్టి విసుగ్గా పర్సు బయటికితీశాడు.

'వెధవలు - వెధవలు! యెప్పుడూ ఎవడో ఒకడు ఇలా బండికింద చస్తూనే వుంటారు. అయినా అంత వొళ్లు మదమేమిటి పిల్లల్ని జాగ్రత్తచేసుకోలేరూ? నాగుర్రాలకాళ్ళకి యేవిఁ దెబ్బలు తగిలాయో ఏమి యేడిశాయో!—అరేయ్! ఇది ఆ వెధవ ముఖాన పారెయ్!'—

పర్సులోనుంచి ఒకబంగారు నాణెంతీసి కోచ్‌వాలా నిల్చున్నవేపు విసిరాడు. అందరూ అటు తిరిగి క్రిందబడ్డ ఆనాణెంవంక చూస్తున్నారు. ఆ అభాగ్యుడు మళ్ళీ అరిచాడు: 'చంపేశారు!'

మరొక క్రొత్తవ్యక్తి ముందుకు వచ్చి అతన్ని ఆపివేశాడు. ఆవచ్చిన కొత్తమనిషి భుజంమీద తలవాల్చి ఆ అభాగ్యుడు పసిబిడ్డలా వెక్కి వెక్కి యేడ్చాడు. క్రొత్తమనిషి ఓదారుస్తున్నాడు.

'అంతా నాకు తెలుసురా తండ్రీ—తెలుసు ఓర్చుకోయేమి చేస్తాం—ఆ సన్నాసి అలా హఠాత్తుగా ప్రాణాలు విడవడమే మంచిది. ఇంకోగంటో అరగంటో బ్రతికితే ఎంతబాధపడేదో!'

ఆ వ్యక్తి వంకచూసి జమీందారు చిరునవ్వు నవ్వాడు—

'అబ్బాయ్! యెవరమ్మా నువ్వూ! మంచి వేదాంతివిలాగున్నావే—నీ పేరేవిఁటి?'

'నా పేరాఅండి—డిఫార్జ్'

'వృత్తేవిఁటి?—'

'సారావ్యాపారం—'

'వేదాంతీ, సారావ్యాపారం, బాగుంది—ఇది తీసుకో, ఏదైనా ఖర్చుబెట్టుకో!' మరోబంగారునాణెంతీసి గిరవాటేశాడు—అరేయి! గుర్రాలకేవీఁ దెబ్బతగల్లేదు గాదురా!—బండిపోనీ'

దోవలోవున్న సామాన్య వస్తువును దేన్నో పాడుచేసి, దాని ఖరీదిచ్చి అవతలికిపోతున్న పెద్దమనిషి ధీమాలో జమీందారు ప్రశాంతంగా బండిలో కూర్చున్నాడు. బండి కదలబోతోంది. ఇంతలోనే ఒక బంగారునాణెం రివ్వున యెగిరొచ్చి 'టాంగు'నబండిలోపడ్డది. జమీందారు ఉగ్రుడై మండిపోయాడు. అరేయ్! బండి ఆపు!—ఎవడురా ఆ బద్మాష్ గిరవాటేసింది!'

కోచ్‌లోనుంచి బయిటికి చూచాడు. ఇందాక డిఫార్జ్ నిల్చున్న వేపు చూచాడు. అత నక్కడలేడు. ఆ ప్రదేశంలో ఆ బిడ్డ తండ్రి బోర్లబొక్కలుగా పడుకుని దుమ్ములో పొర్లాడుతూ వెర్రివాడిలా యేడుస్తున్నాడు. లావాంటి ఆడమనిషి లతలు కుట్టుకుంటూ దగ్గిరలో నిల్చునుంది.

'కుక్క వెధవల్లాలా!' అన్నాడు జమీందారు. ముక్కు కొళ్ళు మెలికెలు తిరుగుతున్నయ్. 'మిమ్మల్నందర్నీ గుర్రాల డెక్కల క్రిందేసి మొత్తంగా తొక్కించి నాశనంజేస్తా—ఆటే కంకారంటే. ఆ గిరాటేసిన వెధవెవడో ఇట్టా ముందుకొస్తే ముందువాణ్ణి నలిబిలిగా తొక్కించకపోతే నాపేరు జమీందారు గాదు—తడాఖా.'

ఒక్కడూ నోరు మెదపలేదు. వాళ్లపరిస్థితి యేవిఁటో వాళ్లకి తెలుసు. నిజంగా ఆయన తలుచుకుంటే అంత పనీ చేసి తీరగలడు. శాసనాధికారం అవధులలోనూ అవధుల నతిక్రమించీ కూడా ఆయన శక్తిసామర్థ్యాలేమిటో వాళ్ళకి తెలియనివి కావు. ఎక్కడివాళ్లక్కడ తలులు వంచేసి, కిం నాస్తిగా ఊరుకున్నారు. లేసు అల్లుతున్న ఆ యిల్లాలుమాత్రం కోరగా తలపైకెత్తి జమీందారు ముఖంలోకి చూచింది. జమీందారు దర్జాకు ఆ అబల ఒక లెక్కాపత్రమా? అసలా మనిషివంక చూడకుండానే ఆయెలుకలమందినంతా ఒక్కసారి కోపంగా కలియజూచి 'తోలరా!' అని కోచ్‌వాడికి హుకుం చేశారు.

ఆయన కోచ్ ముందు పోతోంది: దాని వెనకతక్కిన-శకటాలన్నీ ఒకదానివెంట ఒకటి పెళ్లి బళ్లలా పేరాములు తీస్తున్నయ్: మంత్రి, అభివృద్ధిశాఖ డైరెక్టరు, మహాభూస్వామి, డాక్టరు, లాయరూ, మతగురువూ, నటీనటులూ, వాద్యగాళ్లు ఈ పగటివేషాలన్నీ పరంపరగా సాగిపోతున్నయ్. ఎలుకలన్నీ బొరియల్లోనుంచి బయటికొచ్చి గంటలతరబడి ఈ ఉత్సవాన్ని చూస్తూ తెల్లబోయి నిల్చున్నయ్. పోలీసు టోపీలు హడావిడిచేస్తూ ఈ యెలికెల్ని రోడ్డుమీదికి రాకుండా అదుపుచేస్తున్నయ్. ఆ రక్తపుముద్దను నెత్తికెత్తుకుని ఆ అభాగ్యుడు ఎక్కడికో వెళ్ళిపోయాడు. అంతవరదాకా ఆరక్తపుముద్ద చుట్టూమూగిన ఆడవాళ్లు ఆ సంగతి మరిచిపోయి ఉత్సవం చూస్తున్నారు. లేసుకుట్టుతున్న ఆ యిల్లాలు మాత్రం అలానే కుడుతూ నిల్చుంది. ప్రక్కనున్న జలయంత్రంలోనించి నీరు ప్రవహించుతూనే వుంది; సెలయేరు ప్రవహించుతూనే వుంది; పగలు రాత్రిలోకి ప్రవహించింది. నగరంలోవున్న అనేకుల బ్రతుకు మృత్యువులోకి ప్రవహించింది కాలవాహినులు ఏ మానవుడికోసమూ ఆగవు; ఎలికలు చీకటి కలుగుల్లో ఒకదాన్ని ఒకటి కావిలించుకుని నిద్రపోతున్నయ్. జమీందారు భవనంలో దీపాలు వెలిగించారు. విందువినోదాల, కోలాహాలం తిరిగి ప్రారంభమైంది. యధాతథంగా కాలచక్రం తిరిగిపోతోంది.






# ★ సీను - భాను ★

శ్రీ కవిరావు

సీనూ, భానూ, ఒకనాడు
చీకటిలో పోసాగారు.

జాడా తెలియక చీకటిలో
పేడ కుప్పొకటి త్రొక్కారు.

సీను కంటె ప్రతివిషయంలో
భానే గొప్పని చెప్పాలి.

ఇద్దరిలోనూ సీనసలు వట్టి
శుద్ధ మొద్దు దద్దమ్మ.

'కాలికి తగిలిన దేదా?' యని భా
నాలోచనలో పడ్డాడు.

కాలి నున్నయది వ్రేలికి వ్రాసుక
చాలసేపు మూచూశాడు.

రోతకంపుగా వుందని ముక్కుది
చేతి రుమాలుకు తుడిచాడు.

కాలిని వ్రేలికి, ముక్కు, రుమాలుకు
నాలుగుచోటుల చేసికొనక.

తెలివికి గురు తిది లెమ్మని భానుని
నలుగురు హేళన చేశారు—
కాలికి తగిలినదానిని సీను
నేల కప్పుడే తుడిచాడు.

తెలివి గలారని గర్వపడే
దేవయలొక్కొక్కప్పు డిలా
చిన్న చిన్న విషయంబులె తేలక
తన్నుక తన్నుక చస్తారు.

తూరుపు పడమర తెలియక మిడికే
వార లొకప్పుడు కొన్నింటగ
స్వంతముగా యోచిస్తారు.
యింతో మురుగనిపిస్తారు



# పంచతంత్రం

(బొమ్మల కథ)

— విశ్వాత్ముల నరసింహమూర్తి —





























# మిత్రభేదం





మహిళాపురమను నగరంలో


వర్ధమానుడనే వర్తకుడు


ఉన్నది చాలక యింకా ఎక్కువ
గణించాలనే ఆశ జనించగ


సంజీవకుడూ, నందకుడూ అను
రెండెద్దులతో బండిపూన్చుకొని
సామానంతా వెంటబెట్టుకొని


అడవి దారిలో పోతూవుండగ
బండీ బోల్తా కొట్టింది


సంజీవకునికి కాలు విరగగా
వర్ధమానుడెంతో వగచాడు


"ఈ ఎద్దుకు నయమయ్యేదాకా
మీరిద్దరు యిక్కడే వుండండి"


నలుగురు కోయల సాయంతో తను
ముందుకు పయనం సాగించాడు


కాకులు దూరని కీకారణ్యం!
గుబుల్ గుబుల్ మను చీకటి రాత్రి!


అకస్మాత్తుగా భయంకర ధ్వని
ఏదో యిద్దరు విన్నారు


"బ్రతికివుంటే బలుసాకైనా
తినచ్చు బాబోయ్ అంటూ యిద్దరు
పిక్కబలము చూపించారు


పాపం! సంజీవకుడప్పుడు
తన దుస్థితికై ఏడ్చాడు


తిప్పలు పడి తుదకెల్లాగోమరి
మెల్లమెల్లిగా లేచాడు


కొన్నాళ్ళల్లా అడవిలో తిరుగుతు
ఒత్తుగ పెరిగిన ఆకులు అలములు
మేసిమేసి తెగబలిశాడు




(గత సంచిక తరువాయి)

"ఏమోయ్ సుందరం! నీకు గంట స్తంభాలనుగురించి కదూ చెప్పతున్నాను." అంటూ గడియారం హెచ్చరించింది. "లండన్‌లో వెస్టు మినిస్టర్ భవనంమీద బిగ్ టామ్ అనే గడియారం 650 ఏండ్లకు పూర్వం వెలసిందని చెప్పానా! ఆ తరువాత కొద్ది సంవత్సరాలలోనే ఫ్రాన్సురాజు ఐదవ చార్లెసు ప్రత్యేకంగా జర్మనీ నుంచీ హెన్రీ డి వీక్ అనే ఆయనను పిలిపించి పారిస్‌లోని తన రాజభవనంపై పెద్ద గడియారం ఒకటి కట్టించాడు. ఆ హెన్రీ డీ వీక్‌కు యీ గడియారాన్ని తయారు చేయటానికి ఎనిమిది ఏండ్లు పట్టింది. ఆపని అంతా పూర్తి అయ్యాక ఫ్రెంచిరాజు ఆయనకు దినసరిబత్తెం కొంత యిచ్చి, ఆ గంట స్తంభంలోనే ఆయన కాపురం వుండేందుకు అనుమతించాడు. ఎప్పటికప్పుడు గడియారం ఆగిపోకుండా చూస్తూ వుండటమూ, చెడిపోయినప్పుడల్లా బాగు చేయటమూ యీయన పని. మళ్ళీ కొన్నేళ్లు గడిచేలోగానే జాన్ జోవెన్‌సీ అనే ఫ్రెంచివాడే ఒకడు మరొక పెద్ద గడియారాన్ని రాజుగారికి తయారు చేసి యిచ్చాడు ఆ తరువాత యూరపులో అన్ని ముఖ్యపట్టణాలలోనూ క్రమంగా గంట స్తంభాలు వెలిశాయి." అని చెప్పి గడియారం ఆగింది.

"అదేదీ-ఆ గడియారం...దాని పేరూ...ఏదో చెప్పావే యిప్పుడు? 'పెద్దన్నయ్య' అనిఏదో..." అంటూ సుందరం ఆపేరు జ్ఞాపకం తెచ్చుకోవటానికి తంటాలుపడుతున్నాడు.

"అదా-బిగ్‌టామ్. లండన్‌లో వుండే గడియారం. దాని సంగతి ఏమిటి అడుగుతున్నావు?" అని గడియారం అడిగింది.

"అదే. ఆ గడియారాన్ని గురించి ఏదో కథ చెప్పతానన్నావుగా; యిందాక."

"మరే. మరచిపోయాను సుమా! గడియారం ఎంత పెద్దదైనా కానీ, ఎంత ఖరీదుపెట్టి అయినా కొననీ, దానితో ఎప్పుడో ఒకప్పుడు తంటా రాకమానదు గదా. అలాగే యీ బిగ్ టామ్‌కు కూడా ఒకసారి తమాషా అయిన తెగులు వచ్చింది. మరి యింత పెద్ద గడియారానికీ పురెలో ఏమి తొలిచిందో ఏమో, వున్నట్లుండి ఒకనాటి అర్ధరాత్రి

12 గంటలప్పుడు 12 గంటలే కొట్టి పూరుకోక 13 గంటలు కొట్టింది. ఇలాటి పొరపాటు యీ గడియారం ఎందుకు చేసిందో యీ నాటికీ ఎవరికీ అర్థం కాలేదు. కానీ, ఆరోజున ఆ గడియారం చేసిన ఆ ఒక్క పొరపాటుమూలంగా ఒకానొక సిపాయికి మరణదండన తప్పింది.''

"అది ఎలాగు?''

"ఎలాగంటే — ఆరోజు రాత్రి లండన్ నగరాన్ని దట్టమైన మంచు పొర కప్పేసింది. ఆరోజుల్లో రాత్రి వేళ వీధుల్లో దీపాలైనా పెట్టేవారు కాదు. రాజుగారి భవనంముందు ఒక సిపాయి పహారా కాస్తున్నాడు. అప్పటికి ఎంతసేపటినుంచీ కాళ్ల మీద నిలుచుని వున్నాడో ఏమో ఎప్పుడెప్పుడు 2 గంటలు అవుతుందా, ఎప్పుడు మరొక సిపాయి డ్యూటీలోకి వచ్చి తనకు విశ్రాంతి యిస్తాడా అని లెక్కపెట్టుకొంటూ రాజభవన సింహద్వారం ఎదురుగుండా అటునుంచి యిటు, యిటునుంచి అటు తుపాకీ పుచ్చుకు తిరుగుతున్నాడు. మంచు దట్టంగా కప్పేసి వున్నదేమో, చలి బొమికలు కొరికేస్తున్నదీ. క్షణం గడిచిన కొద్దీ యితని కాళ్లతీత, చలిబాధ ఎక్కువౌతున్నాయి. ఇంతలో అటు తనప్రక్కగా ఎవరో నలుగురైదుగురు మనుష్యులు వెళ్లుతున్నట్లు అడుగుల చప్పుడైంది. వాళ్లు ఏవో గుసగుసలాడుకొంటున్నట్లు కూడా వినిపించింది. ఈ సిపాయి చెవులు రిక్కించి విన్నాడు. శబ్దం వినవచ్చిన దిక్కుకు తుపాకీ గురిపెట్టాడు. కానీ ఎంతసేపు



ఒంటిగీతబొమ్మ—టి. యస్. మణ్యం, కాళహస్తి.

వస్తాయంచి విన్నా మళ్లీ ఎటువంటి చప్పుడూ వినపించలేదు. కళ్లు ఎంత పొడుచుకు చూసినా ఆ చీకటిలో ఏమీ కనుపించలేదు. అసలు ఏ శబ్దమూ కాకుండానే తను పరధ్యానలో వుండి ఏదో శబ్దాలు విన్నానేమో అని సరిపెట్టుకున్నాడు. ఇంతలో బిగ్‌టామ్ గంటలు కొట్టడం మొదలు పెట్టింది. ఈ సిపాయి అలవాటుప్రకారం అవతల బిగ్‌టామ్ ఒక గంట కొట్టినప్పుడల్లా నేలమీద తన తుపాకీ మడమతో కొట్టి ఒకటీ, రెండూ, మూడు అంటూ లెక్కపెట్టటం మొదలు పెట్టాడు. ఆరోజు అలా లెక్కపెట్టితే పదమూడు గంటలు లెక్కకు వచ్చాయి. ఇదేమిటి-ఎన్నడూ లేనిది యీ గడియారం యిలా 13 గంటలు కొట్టిందేమిటా అని ఆశ్చర్యపోయాడు."

"నిజంగా ఆ గడియారం 13 గంటలు కొట్టిందా?" అని సుందరం అడిగాడు.

"ఊఁ! నిజంగానే 13 గంటలు కొట్టింది. ఈవిషయం మరునాడు బుజువైంది కూడాను. మరునాటి వుదయానికల్లా లండన్ నగరం నగరమంతా గుప్పుమన్నది. బిగ్‌టామ్ 13 గంటలు కొట్టిందనికాదు. రాజకుమార్తె తాలూకు విలువగల ఆభరణం ఒకటి ఎవరో దొంగలు ఎత్తుకుపోయారని. ఇంకేముంది? పెద్దవిచారణా అదీ ప్రారంభమైంది. కోటగుమ్మం ముందు, వస్తువు పోయిన వేళకు కాపులా వున్న యీ సిపాయి, తన డ్యూటీ మానేసి నిద్రపోతూ వుంటాడనీ, ఆ అదను చూచుకొనే దొంగలు కోటలో ప్రవేశించారనీ అధికారులు ఆరోపించారు. ఈ సిపాయికి మరణదండన తప్పని పరిస్థితి ఏర్పడింది. సిపాయి మాత్రం తాను నిద్రపోకుండా తనపని తాను చేస్తూనే వున్నానని కోర్టువారికి చెప్పకొన్నాడు. వారు ఎంతకీ యీతని వాదన నమ్మలేదు. చివరకు యిలా కాదని- ఆసిపాయి,

(31-వ పేజీ చూడండి)

# నవ్వులాట నిజమయితే

**శ్రీ కర్రా ప్రభాకర్**

కూనవరంలో కమలాలు సెట్టిగారని ఒకపెద్ద రవాణావ్యాపారస్తుడు వుండేవాడు. పెద్ద రాదారి పడవలు ఆరో ఎనిమిదో ఉన్నాయి ఆయనికి. నల్లరాతి విగ్రహంలా గల్లాపెట్టెముందర కూర్చుంటే వచ్చేపోయే ఖాతాదార్లందరూ నిజంగా దేముడి దర్శనానికే వస్తున్నారన్నట్లుగావుండేది. ఆ సెట్టిగారి రెండు చెవులకీ తళతళలాడుతూ వజ్రాలుపొదిగిన కమలాలు రెండుపెద్దవి, ఎంతదూరాన్నుంచయినాసరే, సెట్టిగారు కొట్లోఉన్నదీలేనిదీ తెలియపరుస్తుండేవి. అందుకనే అంతా ఆయన్ని "కమలాల సెట్టిగారు" అని పిలిచేవారు.

కాని, కాలం ఖర్మం కలిసిరాకపోతే గడ్డిపోచకూడా పామై కరుస్తుందంటారు కాదూ! గోదావరిమీద చెలరేగిన పెద్దగాలివానకి ఆయన పడవలు అయిదు అమాంతంగా మునిగిపోయాయి. వాటిలోని వేలు విలువచేసే సామానంతా గోదావర్లో కలిసిపోయింది! ఆ పడవలకి సరుకు కెత్తించినవాళ్లంతా ఆయన్ని చుట్టుముట్టేశారు. ఇంట్లో వున్న వెండిబంగారు సామాను అంతా సరుకు నష్టంక్రింద ఖాతాదార్లకి ముదరాయిచ్చినా వజ్రాల కమలాలుగూడా ఊడదీస్తేకాని ఆ నష్టం ముదరా పూర్తిఅయింది కాదు.

ఇకముందునుంచి 'కమలాలు సెట్టి' అని పిలిపించుకోడానికి యోగ్యతలేక, ఇన్నాళ్లు 'కమలాలుసెట్టి'గా బ్రతికి ఇకముందు మరోలా బ్రతకలేక, పాపం, బెంగతో కమలాలుసెట్టి కాలంచేశాడు!

ఇకఇంట్లో మిగిలినది సెట్టిగారి పెళ్లాం, పదిహేనుఏళ్ల కూతురు 'భాగ్యం'. భాగ్యానికి ఆ ఏడాదే పెళ్ళిచేదాం అనుకుంటూండగా జబ్బుపడింది. ఆ జబ్బులో వుండగానే తండ్రిపడవలు మునిగిపోయి, దివాలాతియ్యడం, ఆ బెంగతోనే చచ్చిపోవడం ఒకదానిమీదమరోటి జరిగాయి. పాపం భాగ్యం, వంటినిండా నగలు దిగేసుకుని, చీనిచీనాంబరాలతో భాగ్యలక్ష్మిలా తులతూగుదామనుకుంటూ పెద్ద గాలిమేడకట్టుకుని వుంది. అదిఅంతా గాలివానకి ఎగిరిపోయింది. ఆ యింటిలోకల్లా సెట్టిగారిభార్యమాత్రం కొంచం గుండెదిట్టంకలిగిన మనిషి. అయినా, రోజురోజుకూ అల్లా ఎండిపోతూన్న పెళ్ళికాని పిల్లను ప్రతిక్షణం చూస్తూ ఎలా నిబ్బరంగా వుండగలదు!

ఆవూరిలోని హోమోపతి డాక్టరుగారిచేత మందు ఇప్పిస్తూనేవుంది. ఆ డాక్టరుగారికికూడా ప్రాక్టీసు చాలతక్కువ. అంచేత డబ్బు అప్పటికప్పుడు చేతిలోపడకపోయినా, ఏదోవృత్తినడుస్తూవుంటేనేకాని అసలు నిలుచుందుకే చోటుండదని చెప్పి, పిలిచిన వారింటికల్లా వెళ్లి ఏదో తనకి చేతనయినంతమట్టుకు వైద్యసహాయంచేస్తూ వుండేవాడు. అదేవిధంగా భాగ్యానికికూడా వైద్యంచేస్తూ వస్తున్నాడు చాలారోజులనించి. ఇచ్చే మందుల గుణంకంటే గుండెనిబ్బరం ఎక్కువ పనిచేస్తుందంటూ సలహాలు ఇస్తూండే వాడు.

ఇలా వుండగా ఓరోజు ప్రొద్దున్న సెట్టిగారింటి ముందు టెలిగ్రాఫ్ బంట్రోతు నుంచున్నాడు. సెట్టిగారి పెళ్లాం దడదడ వణికే చేతులతో ఆ టెలిగ్రాం తీసుకుని ప్రక్కవీధిలోనే వున్న డాక్టరుగారింటికి పరుగెత్తింది. డాక్టరు చిర్రుమని కవరు చింపి చదివాడు. "భాగ్యానికి ఆ స్ట్రేలియాలోని మెల్బోర్న్ గుర్రపు పందాలలో మొదటి బహుమానం లక్ష రూపాయిలు వచ్చింది"ట!

కమలాలు సెట్టి బ్రతికుండగా ఒకడు యీ లాటరీ టిక్కెట్టు ఆయ

నకు అంట గట్టాడు. టిక్కట్లు అమ్మే వాడ్ని వదిలించుకోడానికే పెట్టి ఓ టిక్కట్టు- భాగ్యంవస్తే భాగ్యం పేరు మీదుగానే వస్తుందన్న నమ్మకంతో- అమ్మాయి పేరటే కొన్నాడు. లాటరీ వచ్చిందని తెలిసేసరికి ఆవిడికి పట్టరాని ఆనందం కలిగింది. "భాగ్యలక్ష్మి మాత్రం మా ఇల్లు వదిలి పెట్టదండీ." అంటూ ఇంటి ముఖం పట్టింది. కాని డాక్టరు ఆపు చేశాడు. "ఈపళంగా మీరు ఇంటికి వెళ్ళి భాగ్యానికి ఈవార్త కాస్తా చటుక్కున చెప్పారా - 'ఆఁ!' అని ఒక్కసారి నోరు తెరచి గుండె ఆగిపోయి చస్తుంది మీఅమ్మాయి" అన్నాడు. "అమ్మ బాబోయ్! నిజమే నండోయి"! అని వెక్కి వచ్చి "మరయితే మీరు డాక్టర్లు. దాని కసలే గుండె నిబ్బరం లేదు. మరి మీరే ఈ సంగతి దానికి చెప్పాలి." అని బ్రతిమాలింది డాక్టర్ని. "సరే అయితే మీరు వెళ్ళండి; నేను తరువాత ఏమీ ఎరగనట్టు వచ్చి యుక్తిగా భాగ్యానికి చెపుతాను. ఈసారితో ఆమెవ్యాధి నయం అయిందనే అనుకోండి" అని ఆమెని ఇంటికి పంపించేశాడు.

మరో అరగంట పోయిన తరువాత నెమ్మదిగా భాగ్యం మంచం దగ్గరికి చేరాడు డాక్టరు. మొదట వ్యాధి ఎలా వున్నదని అడిగి "ఈసారి మరో కొత్త మందు తయారు చేస్తున్నాను నీకోసం; భాగ్యం. కొద్ది రోజుల్లోనే నువ్వు పూర్తిగా ఆరోగ్యం పొందుతావు. నువ్వు వీధి మొహం చూసి ఎన్నాళ్లో అయింద కాదూ. నిన్న మీ అమ్మా నేనూ బజారుకి తీసుకెడతాం; నీ కక్కడ ఏం కావలంటే అవ్వే కొనుక్కోవచ్చు - చీరలు, గాజులూ..." అని ఇంకా ఏవేవో చెప్ప బోతూంటే తనని చిన్న పిల్లనిచేసి మాట్లాడుతూన్నందుకు డాక్టర్ని ఏడిపించాలని బుద్ధివేసింది భాగ్యానికి. అందుచేత అందికదా- "ఇంత జబ్బుపడి లేచింతర్వాత నాకు కొనివ్వ దలచుకుంటే వెధవచీరలూ గాజులేనా" అని. చక్కగా తన దారిలోకి వస్తూన్నందుకు డాక్టరు చాలాసంబరపడిఅన్నాడు. "అయితే నీయిష్ట ప్రకారమే కొంటాం. ఓ రెండు వందల రూపాయ లిస్తాం అనుకో; అప్పుడు ఏం కొంటావ్?"

"బంగారపు నాను చేయించు కుంటా."

"ఓ వెయ్యి రూపాయి లిస్తాం; అప్పుడేం కొంటావ్ ?"

"నాలుగు పేటల బంగారు గొలుసు చేయించు కుంటా."

ఒక్కొక్క మెట్టే పైకి వస్తూన్నందుకు డాక్టరుకు ధైర్యం కలిగింది- "పదివేల రూపాయి లిస్తాం అనుకో; అప్పుడేం కొంటావ్ ?"

"అంచక్కా మంచి పొలం కొంటాను."

"పాతిక వేలు ఇస్తాం అనుకో."

ఇప్పటికి భాగ్యానికి కొంచం విసుగు పుట్టింది. అయినా ఎందుకనవసరంగా బైటపడడం అనుకుని తమాయించు కుంటూ అంది "ఆ పొలంలో అంచక్కా ఓ మేడ కడతాను."

"యాభై వేలు ఇస్తాం అనుకో"

డాక్టర్ని ఏడిపిద్దామనుకున్న భాగ్యానికి, తనకే నిజంగా ఏడుపు వచ్చినంత పనయింది. అయినా ఈసారి మళ్లీ అడిగితే చెప్పుదెబ్బ లాంటి సమాధానం ఇద్దాం అనుకుని అంది - "మాంచి కారుకొని, పదిమంది నౌకర్లు పెట్టి రోజూ సంగీత కచ్చేరి చేయిస్తా" అని చెప్పి ఆ ప్రక్కకి తిరిగింది. ఇక ఫరవాలేదనుకున్నాడు డాక్టరు. ఓసారి తన గుండె నిముురుకొని

(31-వ పేజీ చూడండి)





# విజ్ఞాన వీధులు

## "డాక్టర్"



**12. దీప నిర్వాణ గంధానికి దూరంగా వుండు.**

ఆరిపోయే వత్తి చిమ్మే వాయువుని 'దీప నిర్వాణ గంధం' అంటారు. అందులో దీప్తాంగార వాయువు (కార్బన్ మోనాక్సైడు) అనే అపాయకరమైన వాయు వుంటుంది. కనక దాన్ని మనం పీల్చకుండా జాగ్రత్త పడాలి.

దీప నిర్వాణ గంధాన్ని కావాలని ఎవరూ పీల్చరు; నిజమే. కాని ఏమరుపాటుగా వున్న కొన్ని సందర్భాల్లో దానంతట దే మన ముక్కుల్లోకి చొరబడుతుంది. ఆ సందర్భాలేమిటని మనం గుర్తించుకుంటే దానివల్ల జరిగే కీడునించి తప్పించుకోవచ్చు.

మనలో కొంతమందికి పడుకోబోయేటప్పుడు కిరసనాయిలు దీపాన్ని తగ్గించి నోటితో ఊదేశే అలవాటు వుంటుంది. ఆసమయంలో ఎగ ఊపిరితో దీప నిర్వాణ గంధం సూటిగా వారి ముక్కుల్లో ప్రవేశిస్తుంది. ఆ గంధంతో వుండే దీప్తాంగార వాయువే మనకి ప్రబల శత్రువు. అది నూనె పదార్థాల్ని గాలి సరఫరా విరివిగా లేనప్పుడు వెలిగించినా, అలాగే బొగ్గుల్ని వెలిగించినా మండే బొగ్గులమీదికి గాలి చొరబారకుండా మేటి వేసినా కూడా తయారవుతూంటుంది. కనక బొగ్గుల కుంపటిని వెలిగించి విసనకర్రతో గాలి విసిరేటందుకు బద్ధకించి నోటితోనే ఊది నిప్పు రాజబెట్టే గృహిణి దీప్తాంగార వాయువుని కొంత ఆఘ్రాణిస్తుందన్న మాట. శీతలదేశాల్లో చలి బాధ తగ్గించుకోనేటందుకు గది మూలల్లో నెగళ్లు వేసుకొనే ఆచార ముందన్న విషయం జగత్ప్రసిద్ధము. వేడి చాలక తృప్తిలేకనో, పరాకుపడటంవల్లనో కొందరు గది తలుపులు కూడా వేసుకొని నిద్రించడమూ రాత్రల్లా ఆమంటకి చాలినంత గాలి అందకపోడమువల్ల తయారయే దీప్తాంగార వాయువులోనే మునిగి తేలి విగత జీవులవడమూ అప్పుడప్పుడు పత్రికల్లో కానవస్తూంటాయి.

పైన పేర్కొన్న దీపనిర్వాణ గంధం ఆఘ్రాణించే సందర్భాలన్నీ కొంచెం మాలుగుమోతుతనంవల్లా, దాని నిజ స్వభావం పూర్తిగా తెలియక పోవడంచేత కలిగిన నిర్లక్ష్యం వల్లా ఏర్పడుతున్నాయి. దాని విషపు పుచ్చుగుణం కనక తెలుసుకుంటే ఎవరూ దానికా అవకాశాలు కలగనియ్యరనేది నిశ్చయం. అందులో ఉన్న దీప్తాంగార వాయు బలేదొంగవు. దానికి వాసన ఏమీ లేదు. దాన్ని పీల్చేవారికి పాపం తాము విషవాయువుని పీలుస్తున్నామనే విషయమే తెలియదు. నిజానికి అది తడిగుడ్డతో గొంతు కోసేటటువంటి పన్నమాట. ముందు చల్లగా ఊపిరి తిత్తుల్లోకీ, అక్కడి నుంచి రక్తంలోకీ చేరుకుంటుంది. దాంతో రక్తానికి శరీరంలో ఎక్కడికి కావలిస్తే అక్కడికి ప్రాణవాయువుని సరఫరా చేసే శక్తి నశిస్తుంది. అందువల్ల కర్మేంద్రియాల శక్తి నశించి క్రమంగా స్మృతి తప్పుతుంది. తరవాత మిగిలిన ప్రాణము కాస్తా పోతుంది. ఇలా చలితేలులాగ పని చేసే విషవాయువు యొక్క మోతాదు కూడా ఏమంత ఎక్కువకాదు. మనం పీల్చుతూండే గాలిలో లక్షపాళ్లల్లో ఒక్కపాలు దీప్తాంగార వాయువున్నా విషప్రయోగ దుర్లక్షణాలు కన్పిస్తాయి. 750 పాళ్లల్లో ఒకపాలుంటే మరి చెప్పనక్కరే లేదు. ఈ విషాన్ని నిల్వరించుకోడం అసాధ్యం. ఈ విషానికి విరుగుడు లేదు. మోతాదు తక్కువై రోగి సొమ్మసిల్లిఉన్నప్పుడు తెలిస్తే, అనుభవజ్ఞులైన వైద్యులు ప్రాణ

(48-వ పేజీ చూడండి)

## నవ్వులాట నిజమయితే

(29-వ పేజీ తరువాయి)

అన్నాడు. "అయితే భాగ్యం నీకు ఏదైనా లాటరీలో ఒక లక్ష రూపాయిలు వచ్చాయనుకో, అప్పుడు..." డాక్టరు వాక్యం పూర్తి చెయ్యకమునుపే ఛర్రున ఈ ప్రక్కతిరిగి భాగ్యం అంది - "అందులో సగం మీకిచ్చేస్తా!"

"ఆ! నాకే! యాభైవేలే!!" అని నోరు తెరిచేశాడు డాక్టరుగారు. కూర్చున్నవాడు కూర్చున్నపాళంగానే కుర్చీలో వెనక్కువాలిపోయాడు.

తల్లీ కూతురు గబగబా ఆయన దగ్గరకు వచ్చి ఎన్నిమార్లో "డాక్టరుగారూ," "డాక్టరుగారు" అంటూ పిలిచారు. ఎన్నిమార్లు పిలిచినా పలుకలేదు. తల్లి కంగారుగా ఆయన్ను కదలించి చూచింది ఏముందీ? డాక్టరుగారి వళ్లు చల్లగా తగిలింది!

★

## గడియారం చెప్పిన కథ

(27-వ పేజీ తరువాయి)

క్రితం రాత్రి 12 గంటలప్పుడు బిగ్ టామ్ 12 గంటలకు బదులు 13 గంటలు కొట్టటం తాను లెక్కపెట్టానని కోర్టువారికి నివేదించాడు. కోర్టువారు నమ్మలేదు. ఇన్నివందల సంవత్సరాలలో ఏ ఒక్కసారీ తప్పుడు గంటలు కొట్టని యీ బిగ్ టామ్‌మీద యీ సిపాయి యింతటి అభాండం వేస్తున్నాడే అని కోర్టువారికి యితనిమీద మాంచి కోపం కూడా వచ్చింది. ఎందుకైనా మంచిదని కోర్టువారు బిగ్ టామ్ గడియారానికి కాపలా కాసే మనిషిని కూడా వచ్చి సాక్ష్యం యిమ్మన్నారు. ఆ కాపలాదారుడు కోర్టుకువచ్చి గడచిన రాత్రి బిగ్ టామ్ 12 గంటలకు బదులు 13 గంటలు కొట్టినమాట వాస్తవమే నని వాఙ్మూలం యిచ్చాడు. అప్పటికి కానీ కోర్టువారికి యీ సిపాయి తన డ్యూటీలో లోపం చెయలేదనే నమ్మకం కుదరలేదు. ఏమైతే నేం-బిగ్ టామ్ చెయ్యక చెయ్యక చేసిన ఒక్క పొరపాటువల్ల అమాయకుడైన ఒక సిపాయిప్రాణం కాపాడింది."

"నువ్వు చెప్పుతున్నది నిజంగా జరిగిందేనా?" అని అడిగాడు సుందరం; గడియారం చెప్పిన యీ కథను నమ్మలేక.

"నా పెండ్యులం తోడు. నిజంగా జరిగింది...ఏమోయ్ సుందరం మఱ్ఱిచెట్టు కథ తెలుసా నీకు?"

"అదేమిటి?...నాకు తెలియదే. చెప్పు చెప్పు."

"ఒక్కక్షణం ఆగు. కడుపులో మళ్లీ దేవుతున్నది." అని గడియారం వూపిరి బిగబట్టింది. అంతవరకు ఆగకుండా వినిపిస్తున్న **టిక్కు-టిక్కు** శబ్దం క్షణంసేపు ఆగింది. గడియారం కడుపులో కొండశిలువ మరొకసారి కదిలింది. గడియారం ఠంగ్ మని అరగంట కొట్టింది.

(ఇంకావుంది)

# నడమంత్రపు సిరి

నేను నిద్దుర లేచానో లేదో— ఊళ్లో యీ వార్త గుప్పు మన్నది. సుబ్బారావు గారి పర్సు పోయిందిట!

సుబ్బారావు గారు మా ఊరికి కొత్తగా వచ్చారు. ఈ ఊరొచ్చి సంవత్సరం కూడా కాలేదు. ఈ వూరు వచ్చినప్పుడు చాలా బీద వాడు. లాటరీలో లక్షలు వచ్చి బాగు పడ్డాడు. మంచి ఇల్లు పొలం కొనుక్కోవాలను కుంటున్నాడు. అందుకని దాదాపు 80 వేల రూపాయలు తీసుకు వస్తుంటే దారిలో పర్సు పోయిందిట.

దానిమీద రక రకాల అభిప్రాయాలు వెలుబుచ్చారు ప్రజలు. "నడి మంత్రపుసిరి ఎందూ మరి!" అన్నారు కొందరు. "నిన్న కాక మొన్నవచ్చాడో లేదో - అంత టెక్కా" దేవుడు మంచిపనే చేశాడు. అన్నారు, ఆయనంటే గిట్టనివారు. ఇంకా అనేక విధాలుగా అన్నారు. ఏదయితే నేం నాకుమటుకు నేను "పాపం! దురదృష్ట వంతుడు" అని అనుకున్నా.

మరి డబ్బుపోయిన వాడు ఊరుకుంటాడా? పేపర్లో వేశాడు. ఎవరి కయినా దొరికితే తీసుకువచ్చి ఇవ్వమనీ; అలా చేసినవారికి 10 వేల రూపాయలు బహుమతి ఇస్తాననీ.

దీన్ని గురించి మళ్ళీ ప్రారంభించారు వూళ్లోవాళ్లు.

"పిచ్చివాడు కాకపోతే ఎవరిస్తారేం దొరికిన డబ్బు?" అన్నదొకావిడ మంచినీళ్ళ బావిదగ్గర.

"ఎంత యిదయినా పదివేల రూపాయ లిస్తాడంటే బహుమతి! ఏమొచ్చిందీ - డబ్బు విలువ తెలుసుంటే!" అన్నది విలువలు తెలిసిన యిల్లాలొకామె.

"డబ్బు విలువ తెలుసుంటే అని దీర్ఘాలు తీస్తావేమిటి? తెలుస్తే

[illegible]

అవిధంగా ఎందు కంటాడు" అన్నదొక నెరజాణ.

"లేక లేక ఒక్కసారి అంత డబ్బు వస్తే ఎలా తెలుస్తుంది లేవే" అన్నది లోకంతీరు తెలసిన లలన.

"ఇంతకీ ఎవరికో డబ్బు దొరకినట్లు, ఆ దౌర్భాగ్యుడు సుబ్బారావుగారికి ఆడబ్బు తీసుకొనివచ్చి యిచ్చినట్లు, అప్పుడే సుబ్బారావు పదివేలు యిచ్చివేసినట్లు మాట్లాడుతున్నారే! అయినా ఒకరిసంగతి నాకెందుకులే; ఎవ రెట్లా పోతే నాకేం" అన్నది ఒక ముదినాప సాని, యిటుమూతి అటు తిప్పుతూ.

"ఒకవేళ దొరికిందే అనుకొందాం. ఎందుకు తీసుకొనివచ్చి యిస్తాడే? వీడిచ్చే పదివేల కోసం ఆ ఎనభైవేలు పోగొట్టు కుంటాడుటే" అన్నదొక నారీరత్నం.

ఇంతలోనే సుబ్బారావు గారి భార్య అక్కడకు వచ్చింది. అందరి నోళ్లూ టక్కున మూతలు పడ్డాయి. ఇదంతా నేను మామేడ మీద నుంచి చూస్తున్నా.

మరునటి దినం ఒకవింత విషయం జరిగింది. రామమూర్తి అనే మధ్య తరగతి కుటుంబీకునికి ఆపర్సు దొరికిందిట. ఆయన ఆపర్సును సుబ్బారావు గారికి తిరిగి ఇచ్చేశాడట. సుబ్బారావు గారు తను అన్నట్లు పదివేలివ్వబోతే "అదేమిటండి. మీడబ్బు మీకిస్తుంటే

(39-వ పేజీ చూడండి)






# డాన్ క్విక్సెట్

### పూర్వకథ

లామంచా అనే గ్రామానికి చెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకడు తనుకూడా ఒక వీరుడు (నైట్) గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినావటి' అనే ఒక ఒంటిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకు తానే 'డల్ సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. ఆమెమన్నన సంపాదించటంకోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని తానే నమ్మాడు ఒకానొక హోటల్ లోకి వెళ్లాడు.

బయట వినిపించిన శంఖాధ్వని తన గౌరవార్థమే కోటయజమాని వూదించాడని డాన్ క్విక్ సెట్ తనలో తానే వుబ్బిపోయాడు ఇంతలో అతని మనస్సులో ఒక శంక బయలుదేరింది. చేటల్లే విప్పారివున్న అతని ముఖం ఒక్కసారిగా ముడుచుకు పోయింది ఆశంక ఏమిటో తెలుసా ? తనకైతే వీరుడికి వుండవలసిన ఒక కవచం, ఒక వుక్కుటోపీ, ఒక గుర్రం, ఒక ఆరాధ్య దేవత అన్నీ వున్నాయి కానీ వీరాభిషేకం కాలేదుగదా అని. అది కాకపోవటం వీరుడైన వాడికి ఎంతటి కొరత? వీరాభిషేకం చేయించుకో కుండా సాహస కార్యాలు మొదలు పెట్టటానికైనా తనకు అర్హత లేదే! చ్ఛ... చ్ఛ...చ్ఛ...ఎంత పొరపాటు. ఈ లాంఛనం యిది వరకే అయిపోయిందనిపించుకొని యీ వీర విహారానికి బయలుదేరి వుంటే తీరిపోయేది కదా ఇప్పుడు మాత్రం మించుకు పోయిందే ముందని తింటూ తింటూ వున్న తిండిని ఆపేసి, ఆ పళ్లేలను పట్టుకు పొమ్మని ప్రక్కనవున్న స్త్రీరత్నాలను పురమాయించాడు వున్న పళంగా లేచి పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ హోటల్ యజమాని (కాదుకాదు—కోట గవర్నరు గారు) ఏమూల వున్నాడో వెదుక్కొంటూపోయి, ఆయన ముందు సాష్టాంగపడి రెండు కాళ్లూపుచ్చుకొని తనకు వీరాభిషేకం చేయుమని బ్రతిమాలాడు.

ఆహోటల్ యజమానికి యిదంతా వింతగానే తోచింది. వెర్రి కాకపోతే—యీయన వీరు డేమిటి? ఈ వీరుడికి తాను వీరాభిషేకం చేయించట మేమిటి? అసలు అంతకు ముందే యీ డాన్ క్విక్ సెట్ గారి బుర్ర కేమైనా చెదలు పట్టాయేమో అన్న అనుమానం ఆహోటలు యజమానికి ఎలాగూ కలిగింది. ఇప్పుడు ఆ వ్యక్తివచ్చి అలా తనకాళ్లు పట్టుకు బ్రతిమ లాడటంతో యీయన అనుమానం దృఢమైంది ఈ పిచ్చివాడిని వుబ్బవేసి కాలం సరదగా వెళ్లబుచ్చ వచ్చు కదా అని హోటల్ యజమాని పైకిమాత్రం డాన్ క్విక్ సెట్ కోరికను ఎంతో మన్నిస్తున్నట్లు, ఆయనను వీరుడుగా గుర్తిస్తున్నట్లు ప్రవర్తించాడు. ముఖంలో ఎక్కడా ఎగతాళి ఛాయలు కనుపించ నీయ కుండా చూసుకొని, "హే! వీరాగ్రేశరా, నీ అభ్యర్థనను అనుసరించి నీకు వీరాభిషేకము సేయ నిచ్చగించు చున్నాను. వీరాభి షేకమునకు పూర్వము నీవొక వీరోచిత కార్యమును ఒనరింపవలసి వున్నది కదా ? నీ కవచాదులను ఒకచోనుంచి యీ గాత్రి రాత్రి అంతయు వాటిని ఏ దుష్కరులూ ఎత్తుకొని పోకుండా కాపాడుకొనుము, రేపటి ప్రాతఃకాలము నకే నీ యీప్సితము నెరవేర్చెద గాక." అని గంభీ రంగా అన్నాడు అలా అంటూ హోటల్ అని పిలువ బడే తనకోటలో యీ కవచాదులను దాచివుంచ దగిన భవనం ఏదీ లేదనీ, అక్కడే అల్లంత దూరంలో కనుపిస్తున్న నీళ్లగాబులో ఆ కవచాదులు పడవేసి తొలికోడి కూసేవరకు కపలా కాయవలసిందనీ సలహా యిచ్చి తాను తప్పుకొన్నాడు. హోటల్లోపలికి పోయి -యింకా కొంతమందిని కూడగట్టుకువచ్చి డాన్

అనువాదం శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

క్వీక్‌సెట్‌కు కనిపించకుండా ఒకచోట నుల్చొని యీయన ఏం చేస్తాడో చూస్తున్నాడు.

డాన్ క్వీక్‌సెట్ ధీమాగా తన కవచాదులను తీసి గుర్రాలు నీళ్లుతాగే ఆ తొట్టిలో పడవేసి, యీటె పుచ్చుకొని దానిచుట్టూ తిరుగుతూ కాపలా కాస్తున్నాడు.

పచ్చపువ్వులా వెన్నెల కాస్తున్నది ఆవెన్నెల అదీ చూసేసరికి డాన్ క్వీక్‌సెట్ మనస్సు బలే తేలిక పడింది. వీరాభిషేకం కాలేదన్న ఆ ఒక్క కొరత కూడా రేపు తెల్లవారేలోగా తీరిపోతున్న దాయెను. మరి అతని మనసు ఎందుకు తేలికపడదు?

ఆ విధంగాచాలా భాగం రాత్రి ఏగొడవా లేకుండా ప్రశాంతంగానే గడిచిపోయింది. ఒక ఝాము రాత్రిగడిచాక సరుకులు మోసుకుపోయే వాడొకడు తన కంచర గాడిదనుతీసుకొని ఆహోటలు ఆవరణాలోకి వచ్చాడు. ఆకంచరగాడిద అలసిపోయి వున్నదేమో, యిన్ని నీళ్లు అయినా పట్టుదామని కళ్లెం పుచ్చుకొని గాబు దగ్గిరకు నడిపించుకు వచ్చాడు. తీరా వచ్చిచూస్తే, తనగాడిద నీళ్లు త్రాగేందుకు వీలు లేకుండా ఆ తొట్టిలో తుప్పు పట్టిన కవచం పడివుండటం చూచి అతడికి వళ్లు మండుకు పోయింది. విసుక్కుంటూ కసుక్కుంటూ అతడు ఆ కవచాన్ని తీసి యివతల పారేశాడు. ఇదంతా చూస్తున్న డాన్ క్వీక్‌సెట్ ఆ పాదమస్తకం కోపంతో కంపించి పోయాడు. ఒక్కమారు పెద్దగా హుంకరించి తన చేతిలో వున్న యీటె మడమతో వాడి నెత్తిన ఒక్కటి పెట్టాడు. దెబ్బ బలంగా తగిలిందేమో, దెబ్బ తిన్నవాడు కిక్కురు మనకుండా పడిపోయాడు. డాన్ క్వీక్‌సెట్ ఒక్కసారిగా విజయాట్టహాసం చేసి ముందుకు వంగి క్రింద పడివున్న తన కవచాన్ని అతి పదిలంగా ఎత్తి మళ్లీ గాబులో పడవేసి, ఎప్పటిలాగు ఏమి జరుగనట్లు కాపలా కాయటం మొదలు పెట్టాడు.

మరికొద్ది సేపట్లోనే మరొకడు యిలాగే తన కంచర గాడిదను తీసుకువచ్చి నీళ్లు త్రాగించబోయాడు. గాబులో అడ్డంగా యీ కవచం పడివుండటం చూసి యితడూ చిరాకుపడి దాన్ని తీసి యివతల పారేశాడు. ఇంతకు ముందే యీపని చేసినందుకు ఒకడికి శాస్తి అయివుండగా, వీడెవడో తలకు మా వాడు మళ్లీ అదేపని చేస్తున్నందుకు డాన్ క్వీక్‌సెట్‌కు కోపంతో పాటు కొంచెం జాలికూడా కలిగింది. అక్కడికీ ముందుగానే చావబాదటం ఎందుకనీ, పెద్ద పె

తిట్లు జతపరచి వీలైనన్ని విధాల వాడికి హెచ్చరికలు చేశాడు. కోపం వచ్చిందంటే తాను మనిషిని కానని ఎన్నిమార్లు చెప్పినా వాడు వినకుండా తన కవచాన్ని తీసి యివతల పారేసేసరికి, నిజంగా యితనికి మనిషికి వచ్చేంత కోపం వచ్చేసింది. ఏమైతే అదే అవుతుందని బలం కొద్ది ఆయీటె మడిమ పుచ్చుకొని ఆ పెంకె ఘటం తలపై ఒక్క దెబ్బ వేశాడు. వళ్లు తెలియని ఆవేశంలో కొట్టాడేమో, వాడి బుర్ర కాస్తా బద్దలు అయింది. వాడు 'చచ్చాన్రో' అంటూ నేలమీద కుప్పన కూలబడ్డాడు. వీడి కేక విన్న మరికొంత మంది సరుకులుమోసే ముఠా వాళ్లు గబగబా అక్కడకు పరుగెత్తుకొంటూ వచ్చి, తమ ముఠాలో ఒకణ్ణి కొట్టి చంపుతున్న డాన్ క్విక్ సెట్ మీద అందరూ కలసి రాళ్లు రువ్వటం ప్రారంభించారు. వాళ్లు విసిరే రాళ్లు తగలకుండా చేసుకోవటానికి డాన్ క్విక్ సెట్ కు ఏదిక్కూ తోచక, తానింతవరకు ఏ నీళ్ల గాబు చుట్టూ అయితే పహరా తిరుగుతున్నాడో ఆగాబు ప్రక్కకే పోయి, దానిచాటున ముడుచుకు కూర్చున్నాడు.

ఇదంతా యింతసేపూ చాటు నుంచి చూసున్న హోటల్ యజమాని, యిక పరిస్థితులు విషమించి పోతున్నాయని గుర్తించినవాడై, అనుచర బృందంతో యివతలకు వచ్చి 'ఆగమ'ని అందరినీ అదిలించాడు. ఇప్పటికి యీ వెర్రివాడి వెకిలి చేష్టలు ఆతనికి మొఖం మొత్తి పోయాయి. ఆ కారణంచేత డాన్ క్విక్ సెట్ తొలికోడి కూసేటంత వరకు కాపలా కాయనక్కరలేదని పురమాయించాడు. వీరాభిషేకం చేయటానికి యింతవరకూ ఆతడు ప్రదర్శించిన ధైర్యసాహసాలే చాలునని కూడ ఆహోటల్ యజమాని బాహాటంగా ప్రకటించాడు.

ఒక కుర్రవాణ్ణిపోయి వెలిగించిన కొవ్వువత్తులు రెండు పట్టుకు రమ్మని కేక వేశాడు. ఆ పల్లెపడుచులను యిద్దరినీ నిద్దరలేపి తీసుకు రమ్మన్నాడు. ఈ ఏర్పాట్లు అన్నీ ముగిశాక, తాను హోటల్ పద్దులు వ్రాసే చిఠ్ఠా తీసుకువచ్చి ఒక పేజీ తెరచి పట్టుకొని ఏవేవో మంత్రాలు చదివినట్లుగా ఆపద్దులే బిగ్గరగా చదివేశాడు. డాన్ క్విక్ సెట్ ను మోకరిల్లమని బారెడు పొడుగున్న కత్తి ఒకటి పుచ్చుకొని ఆకత్తి అంచుతో ఆతని భుజంపై తట్టాడో కొట్టాడో—మొత్తానికి ఆ క్రతువు పూర్తి చేశాడు.

“పాప భూయిష్టమైన యీ భువిని ధర్మమును కాపాడుము. అధర్మమును అణచివేయుము. సాక్షాత్తు ఆ పరమేశ్వరుడు నిమిత్త మాత్రుడనైన నాద్వారా నీకీ ఆజ్ఞయిచ్చుచున్నాడు. నేడు మొదలుకొని ధర్మ రక్షణమే నీదీక్ష. ఈదీక్ష నిర్వాహణము నందు నీ ప్రాణములైనను లెక్కసేయకుము.” అంటూ మతబోధకుల ధోరణిలో ఉపన్యాసం దంచివేశాడు. డాన్ క్విక్



సెట్ కళ్ల వెంట ఆనందాశ్రువులు జోటజోట రాలాయి. ఆ అంగనలు యిద్దరూ డాన్‌క్విక్ సెట్ దగ్గిరకు వచ్చారు. ఒకామె పొడుగాటి కత్తిని ఆతని నడుముకు బిగించి కట్టింది. మరొకామె గుర్రం మీాద జీనూ అదీ సిద్ధంచేసింది. అంతటితో డాన్ క్విక్ సెట్ గారి వీరాభిషేక మహోత్సవం వైభవోపేతంగా ముగిసింది.

డాన్ క్విక్ సెట్ మహదానందంతో వుప్పొంగిపోయాడు. తన వీరాభిషేకంలో పాల్గొన్న వ్యక్తులందరికీ పేరు పేరున కృతజ్ఞతా పూర్వకమైన అభివందనాలు అందచేశాడు. ఈ మహోత్సవంలో ఔత్సుక్యంతో పాల్గొన్న ఆ యిద్దరు స్త్రీలవిషయమూ యితడు మరింత శ్రద్ధగా అడిగి తెలుసుకొన్నాడు. ఒకామె తాను చెప్పులు కుట్టేవాని కూతురునన్నీ, తన పేరు 'టోలోసా' అనీ చెప్పింది. రెండో ఆమె తానొక పిండి మర యజమాని కూతురుననీ, తన పేరు 'మొలివేరా' అనీ చెప్పింది. ఈ యిద్దరు కన్యలు తనకు వీరాభిషేకం చేయించటంలో కనుపరచిన శ్రద్ధకు మెచ్చి డాన్ క్విక్ సెట్ వారిద్దరికీ 'లేడీ' బిరుదులు యిచ్చేశాడు. ఇకపై వారు తమనామధేయాలకు ముందు యీ 'లేడీ' బిరుదాలను కూడా చేర్చుకొని 'లేడీ టోలోసా' అనీ, 'లేడీ మొలివెరా' అని పిలిపించుకో వలసిందిగా అనుమతించాడు. డాన్ క్విక్ సెట్ వెర్రి వాగుడుకు వారిద్దరూ లోలోపల నవ్వు కొంటూనే, పైకి మాత్రం ఆయన ఆజ్ఞ మేరకు లేడీ బిరుదాల్ని స్వీకరించి పాటిస్తామని ఆయనకు వాగ్దానం చేశారు.

ఈ భాగోతం అంతా పూర్తి అయ్యేసరికి ఆకాశంలో తూర్పున తెల్ల రేకలు ఆడుతున్నాయి. తనను వీరుణ్ణిగా చేసినందుకు ఆహోటల్ యజమానిని (కాదు కాదు—కోటగవర్నరు గారిని) తదితరులను మరొకసారి మనసార అభినందించి, వారందరి వద్దను శెలవు పుచ్చుకొని డాన్ క్విక్ సెట్ తనముద్దుల గుర్రం 'రోజినాన్‌టీ' మూాపున ఎక్కినవాడై విశాల ప్రపంచంలోకి వెళ్లాడు.

## 2

డాన్ క్విక్ సెట్ తాను వీరుణ్ణి అయ్యాననన్న వుబలాటం తీరకముందే, ఆమరునాడే, ఒక విచిత్ర సంఘటనలో చిక్కుకుని, వళ్లు హూనం చేసుకొన్నాడు.

ఆ తెల్లవారుఝామున వీరాభిషేకం చేయించుకొని బయలుదేరి 'రోజినాన్‌టీ'ని జోరుగా పోనిచ్చాడు. ఫలానిచోటికి పొమ్మని ఆగుర్రానికి తాను పురమాయించకుండా, ఆగుర్రం తీసుకుపోయిన చోటికి తానేపోవటం మంచిదని అతనికి అనిపించింది. అలా అనిపించటానికి కొన్ని కారణాలు వున్నాయి. ఈరోజుల్లో అన్యాయం జరుగనిచోటు అంటూ ఎక్కడ వుందీ? ఎక్కడాలేదు. అలాంటప్పుడు ముందుగా ఏ అన్యాయాన్ని అణచాలీ అనే సమస్యను పరిష్కరించే బాధ్యత గుర్రానికే వదిలేస్తే మంచిది. ఇది మొదటి కారణం. రెండోది— తన గుర్రం రోజినాన్‌టీ వున్నదే—అది బలే తెలివైన గుర్రం. అసలు ఒక్కొక్కప్పుడు నిజంగా తనకంటే కూడా అదే తెలివైనదనే అనుమానం డాన్ క్విక్ సెట్‌కు అప్పుడప్పుడూ తగులుతూనే వుంటుంది. అలాంటప్పుడు ఎక్కడికి పోవాలి అనే విషయాన్ని తేల్చలేక తన బుర్ర పాడుచేసుకోవటం కంటే కూడా ఆ విషయాన్ని తెలివిగల యీ గుర్రానికి వదిలేయటమే తెలివైన పని అనిపించు కొంటుంది. అందుకని తాను నిశ్చింతగా గుర్రం ఎక్కి కూర్చున్నాడు. ఆ గుర్రం మాత్రం తాను యింతవరకూ వుండటానికి అలవాటు పడివున్న 'లా మంచా' గ్రామంలోని డాన్ క్విక్ సెట్ గారి పశువుల కొష్ఠం వైపుకే దారి తీస్తున్నది. ఆనంద పారవశ్యంలో మునిగి తేలుతున్న డాన్ క్విక్ సెట్ యిది గమనించనే లేదు. ముసలి గుర్రం తక్కుతూ తారుతూ మంద గమనంతో ముందుకు పోతూనే వున్నది. ఇంతలో అల్లంత దూరంలో పెద్దపెద్ద గొడుగులు వేసుకొని పోతున్న గుంపు ఒకటి డాన్ క్విక్ సెట్ కంటబడింది. ఆరుగురు వర్తకులు గుర్రంమీాద ఎక్కి ఎండ తగలకుండా పెద్ద గొడుగులు పట్టుకొని పోతున్నారు. వీళ్ళకు నలుగురు జమానులు. ఆ జమాన్లు కూడా గుర్రాలమీాదే స్వారీ చేస్తున్నారు. కంచర గాడిదలను తోలే మరి ముగ్గురు కూడా వీళ్ల వెంట కాలినడకను వస్తున్నారు.

వీరాభిషేకం కూడా పూర్తి చేయించుకొని సాహస కార్యాలు చేయాలని తపించి పోతున్న డాన్ క్విక్ సెట్ కళ్లకు, వాళ్ల దారిని

వాళ్లు పోతున్న యీ పది మంది మనుష్యులూ పది మంది పెద్ద రాక్షసుల్లా కనుపించారు. అలా అతని మనసుకు తోచీ తోచటంతో వాళ్లు పోతున్న దారికి అడ్డంపడి తన యీటెను హద్దుగా పెట్టి "ప్రాణములపై ఆశవున్నవారెవ్వరైననూ సరే—యీహద్దును దాటుటకు ముందు లా మంచా సామ్రాజ్ఞి 'డల్‌సీనియా డెల్ టొబోసో' రాకుమారిని మించిన అందగత్తె యీ ముల్లోకములందెచ్చటను లేదని ఒక్కమారు గొంతెత్తి చాటవలె. ఇది నాయాజ్ఞ." అంటూ హుంకరించాడు.

ఈ వాగుడూ, ఆమనిషి ఆకారమూ చూసి యీ వర్తకులు కూడా వెనుకటి హోటల్ యజమాని మాదిరిగానే, యిదేదో వెర్రి వేషం క్రింద జమకట్టుకొన్నారు. ఆపది మందిలో ఒకడికి కాసేపు వీడితో కులాసాగా కాలక్షేపం చేయాలనే బుద్ధి పుట్టింది. అందుకని లేనిపోని నమ్రత నటిస్తూ "మహాభాగా, ఏ రాకుమారి సౌందర్యాతిశయాన్ని మీరు యింతగా కొనియాడుతున్నారో ఆమెను మేమెవ్వరమూ మునుపు చూచి వుండలేదు. తమరు దయచేసి ఆమెను మాకు ఒక్కసారి చూపిస్తే, ఆమెకు నిజంగా అంతటి అందంవుందని మాకుతోస్తే, మీరు కోరినట్లే తప్పక ఆమెను మించిన అందెగత్తె యీ ముయ్యేడు లోకాలలో ఎక్కడా లేదని చాటగలం" అన్నాడు. డాన్ క్విక్‌సెట్ మాత్రం ఏం తక్కువ తిన్నవాడా! "మూఢులారా? ఆమెను ఒకసారి చూచిన తరువాత ఆమె అందమును గూర్చి మీరు ప్రస్తుతించుటలో గొప్పదనము ఏమున్నది? ఆమెను చూడకయే ఆమెను మించిన అందగత్తె 'నభూతో నభవిష్యతి' అని గుర్తించి ప్రస్తుతించటంలోనే కదా మీ జన్మలు సార్థకమయ్యేడిని? మీరట్లు ఆమెను ప్రస్తుతింప నిరాకరించువో, వ్యర్థములైన మీనాలుకలను యిదే నాకత్తితో శత సహస్ర ఖండములుగా కోసివేసెద. కాచుకొనుడి." అంటూ బిగ్గరగా అరిచాడు.

"మహాశయా! మీరు ఆమెను చూపించిక పోయిన మానే. ఆమె చిత్రానైనా చూపించండి. ఆ బొమ్మలో ఆమెకు ఒకకన్ను గుడ్డిదైనా కూడా, మీరుకోరినట్లే ఆమె అందగత్తె అని ఒప్పుకొంటాం" అనియిందాక మాట్లాడిన వర్తకుడే యిప్పుడు మళ్లీ సమాధానం యిచ్చాడు.

"ఏమేమీ! నాహృదయాధి దేవతను అంధురాలందువా! కుటిల జన ధిక్కారమును సైతునా! ధిక్కార...ధిక్కార" మంటూ ఆ వర్తకుడి మీదికి తన యీటెను గురిచూసి గుర్రాన్ని ముందుకు దూకించాడు. పాపం ఆ వర్తకుడు యీతని కోపానికి బలి అయ్యేవాడే. కానీ ముసలి గుర్రం మత్తుగా నిలుచుని వుండీ వుండీ ఒక్కసారిగా కదలబోయే సరికి ముందు కాళ్లు వంగక కూలబడి పోయింది. గుర్రంతో పాటు డాన్ క్విక్‌సెట్ కూడా క్రిందపడి వుండలాగా చుట్టుకుపోయి పల్లంలోకి దొర్లుకొంటూ దొర్లుకొంటూ పోయి అల్లంత దూరంలో ఆగిపోయాడు. తగిలిన దెబ్బలకుతోడు ఆ యినపకవచము, వుక్కుడాలు, వుక్కుటోపీ యివన్నీ కలసి అతని వంటిమీద పెద్ద గాడిద అంత బరువుతేలి అతణ్ణి తెగ కుంగదీశాయి. మనిషి కదలలేక పోయాడు. సమయం కనిపెట్టి కంచర గాడిదలు కాసే మనిషి ఒకడు గబగబా వచ్చి యీతని యీటెను వూడలాక్కొని దానిని మూడు ముక్కలుగా విరగగొట్టి, ఒక్కొక్క ముక్కతో ఒక్కొక్క సారి చొప్పున క్రిందపడివున్న డాన్ క్విక్‌సెట్ వంటి మీద తాపామార్చు వాయించాడు. చేతుల దురద తీరేదాక డాన్ క్విక్‌సెట్ వీపుమీద మద్దెల వరుసలన్నీ వాయించి, అంతకుముందే ముందుకు సాగి పోతున్న తమ బృందంవారిని కలుసుకొనేందుకు దౌడు తీశాడు.

డాన్ క్విక్‌సెట్‌కు యీదెబ్బలతో బొమికల్లో సున్నం లేకుండా పోయింది. దీనికి సాయం యీ యినపతొడుగు ఒకటి. దీనిదుంపతెగ యిది మణుగుల బరువు వున్నది. లేవబోతే ఒక చెయ్యికానీ, ఒక కాలుకానీ ఏదీస్వాధీనంలోకి రాలేదు. చేసేది ఏమీలేక ఆకాశంలోకి గుడ్లప్పగించి చూస్తూ అలాగే గంటల తరబడీ పడివున్నాడు. ఇప్పటికీ అలాగే అక్కడే పడి వుండే వాడేమోకానీ,—యింతలో వాళ్లవూరి వాడే ఒక రైతు పొలం పనిమీదపోతూ ఆదారి వెంట వచ్చాడు. ఎవడో మనిషి యిలా కట్టెలా పడివుండటం చూసి జాలివేసి దగ్గరకు వచ్చి చూశాడు. వాళ్లవూరి మనిషేనని పోల్చుకొన్నాడు. డాన్ క్విక్‌సెట్ ఆరైతుతో తనకేమీ గాయాలు తగలలేదనీ, కొద్దిగా బొప్పెలు మాత్రం కట్టాయనీ చెప్పుకొన్నాడు. చిందర వందరగా పడిపోయివున్న ఆ కవచాన్నీ, టోపీనీ, డాలును, ముక్కలు ముక్కలుగా పడివున్న యీటెను

పోగుచేసి కట్టగా కట్టి ఆ రైతు రోజినాన్‌టీ వీపుమీద పడవేసి దానిని తాను నడిపించుకు వచ్చాడు. డాన్ క్విక్‌సెట్‌ను నెంపాదిగా లేవనెత్తి తన గాడిదమీద ఎక్కించి, ఆ గాడిదనూ, యీ గుర్రాన్నీ కూడా చీకటి చాటున స్వగ్రామానికి చేరవేశాడు.

డాన్ క్విక్‌సెట్ కొంపకు చేరేసరికి మత బోధకుడు, పూరిమంగలి తనయింటి అరుగుమీద చేరి దాదితో బాతాఖానీ వేస్తున్నారు. వాళ్లంతా యీ ఆయన యీ స్థితిలో యింటికి తిరిగి వచ్చినందుకు దిక్కుతోచక తికమక పడ్డారు. ఆత్రతకొద్దీ వాళ్లడిగిన అన్ని ప్రశ్నలకు డాన్ క్విక్‌సెట్ తాను పదిమంది భయంకర రాక్షసులతో యుద్ధంచేస్తూ గుర్రం మీద నుంచి క్రిందపడి దెబ్బలు తిన్నానని మాత్రం సమాధానం యిచ్చాడు. ఆ వేళకు యిక తనను ఏమిటి, ఎందుకు అంటూ ప్రశ్నలువేసి వేధించక కాసేపు విశ్రాంతిగా పడుకోమ్మని బతిమాలాడు. (ఇంకావుంది)

# నడమంత్రపు సిరి

(32-వ పేజీ తరువాయి)

కూడా నాకు బహుమానమే?" అన్నాడట. దాంతో రామమూర్తి గారి ఖ్యాతి దిగంతాలకు వ్యాపించినట్లయింది. చాలా రోజులవరకు రామమూర్తిని గురించే ప్రతి వారూ మాట్లాడే వారు, ఆయన్నే పొగిడేవారు.

ఈలోగా ఎన్నికలొచ్చాయి. అంతకు ముందు అధికారంలో వున్నవారు లంచాలు మరిగారనీ అందుకు వారిని తొలగించి రామారావు వంటి సత్పురుషులను అసెంబ్లీకి పంపిస్తే దేశం బాగుపడగలదనుకున్నారు ప్రజ. "అబ్బే! నాకెందుకండి యింతభారం" అన్నాడు రామమూర్తి. ప్రజలు ఆయనే ఎన్నిక కావాలని పట్టుపట్టారు. "ఏదో మీరింత బలవంతం చేస్తే కాదనలేక పోతున్నా" అని ఒప్పుకొన్నాడు రామమూర్తి.

నరే రామమూర్తి గార్ని నిలబెట్టారు. ఇంకా చాలామంది నిలుచున్నారు. రామమూర్తిగారికి డబ్బుమీద అపేక్షలేదని సుబ్బారావు గారి పర్సువిషయంలో తెలిసింది. అందుకని ఆయనకే ఓట్లు యివ్వదలచుకున్నారందరు. తక్కినవారు లక్షలు లక్షలు ఖర్చుపెట్టారు. వారితో "యిప్పుడు మీరు డబ్బిచ్చి ఓటు వేయించుకొంటున్నారు. రేపు మీరు యింతకు యింత డబ్బెందుకు తీసుకోరు?" అని కూడ కొందరు మిగిలిన అభ్యర్థులను అడుగకపోలేదు. రామమూర్తి గారి స్వంతఖర్చుల నిమిత్తం ఊరంతా డబ్బు చందా వసూలుచేసి యిచ్చింది. ప్రచారం చేసిపెట్టిన మాకు ఆయన కాఫీ ఖర్చులనిమిత్తం డబ్బివ్వబోతే ఎవరూ తీసుకోలేదు. "ఏదో మీయందు అభిమానం కొద్దీ ఈపని చేస్తున్నాం. కాని డబ్బు నాశించికాదని" ఖచ్చితంగా చెప్పాం. ఓటింగు రోజున యిళ్ళకు కార్లు, బళ్ళు పంపిస్తే "మాకెందుకండి యివన్నీ! మీ జోటి వారికోసం మేము నడచి వెళ్లే ఓటు వేస్తాం" అన్నారు. ఒక ముక్కలో చెప్పాలంటే ఆయనకు దమ్మిడీ ఖర్చుకాలేదు.

ఎన్నికల ఫలితాలు ప్రకటించారు. రామమూర్తి గారికే విజయం లభించింది. తక్కిన వారందరకు కలిపి వెయ్యిఓట్లు గూడా రాలేదు. పాపం! డిపాజిట్లు కూడా దక్కలేదు. రామమూర్తి యిప్పుడు అసెంబ్లీ సభ్యుడు అయ్యాడు. మా ఊరికి కొద్దో గొప్పో సహాయం చేశాడు కూడా.

చూస్తుండగానే రెండు సంవత్సరాలు గడచిపోయాయి. ఈలోగా ఆయన రెండు స్వంత మేడలు లేపాడు. రెండు బస్సురూట్లు ఏర్పరచుకొన్నాడు. స్వంతంగా ఒక సినిమాహాలు కట్టాడు. ఫ్యాక్టరీలో షేర్లు కొనేశాడు. ఆయన గురించి విచారిస్తే తెలిసిన సంగతి ఏమిటంటే ఆయన అంత లంచగొండి పుట్టలేదనీ, పుట్టబోడనీ, తెలిసింది అబ్బ వినలేక పోయాను. రామమూర్తి ఎంతగామారి పోయాడు?

"స్వార్థాన్ని అపేక్షించకుండా సుబ్బారావు గారి 80 వేల రూపాయలు—" అని నేనేదో అనబోతే "80 వేలేమిటయ్యా! అసలేమీ లేదు. సుబ్బారావు గారి డబ్బూ పోలేదు; గిబ్బూ పోలేదు. సుబ్బారావు తను నుంచుంటే లాభం లేదని రామమూర్తితో కలిసి నాటకం ఆడాడు. సుబ్బారావు, రామ్మూర్తి వల్ల అనేక సహాయాలు పొందాడు. అందుకని ఆపర్సు పోయినట్లు, అది యీ ధర్మాత్ముడు తెచ్చియిచ్చినట్లు, బహుమానంకూడా వద్దన్నట్లు ఎంతో పెద్ద నాటకం ఆడారు; యిద్దరూ చేరి, ప్రజలను మోసం చేశారు. యిదివరకటి వారంటే వారిని తలదన్నారు వీరు. దమ్మిడీ ఖర్చుకాకుండా అసెంబ్లీ సభ్యుడయి కూర్చున్నాడు. చూద్దాంగా—మళ్ళీ ఎన్నికలొస్తున్నాయిగా" అన్నాడు నామిత్రుడు. నాకు అప్పుడర్థమయింది అసలు సంగతి.

"ఎంత నాటకమాడాడురా" అని అనుకొన్నా నేను.

మళ్లీ ఎన్నికలొచ్చాయి. రామమూర్తి నిలబడ్డాడు. తన పలుకుబడి పోయినట్లు గ్రహించాడు. డబ్బు వెదజల్లాడు. కాని లాభం లేక పోయింది. ఈసారి ప్రజ కన్ను తెరిచింది. రామమూర్తి ఓడిపోయాడు. ఎవరు గెలిచిందీ మనకనవసరం.

ఇదివరకు కట్టించిన మేడలు సంపాదించిన బస్సురూట్లు, సినిమాహాలు ఫ్యాక్టరీలో షేర్లు మాయమయ్యాయి. రామమూర్తి ఇప్పుడు బికారి.

అతను కనబడితే "యితను బలే మంచి త్యాగి" అని కొందరు అంటూ వుంటారు.

నేనుమాత్రం నడిమంత్రపు సిరి అనుకొంటూ వుంటా. ★

# సినిమా వార్తలు

రాజకీయ ప్రపంచంలో వచ్చే అలజడుల ప్రభావం అప్పుడప్పుడుసినిమా రంగందాకా కూడా ప్రసరిస్తూవుంటుంది. గతవారం బెర్లిను ప్రయాణం పెట్టుకున్న ప్రొడ్యూసరు ప్రకాశరావు ప్రభృతులు ప్రయాణం రద్దుచేసుకున్నట్లు తెలిసింది. జి. వరలక్ష్మిగారినీవిషయం ప్రశ్నించగా "తూర్పుజర్మనీ, పశ్చిమ జర్మనీలమధ్య, ముఖ్యంగా బెర్లిన్‌లో సోవియెట్ ప్రాంతం, పశ్చిమ రాజ్యాల ప్రాంతం మధ్య రాకపోకల నిర్బంధాలు వచ్చాయని మాకు తెలిసింది. ఈ సమయంలో అక్కడికిపోతే చిక్కుపడిపోతామేమోనని ప్రస్తుతానికి మానివేశాం"అన్నారు.

* * *

వాహినీవారి సాంఘికచిత్రం "పెద్దమనుషులు" తాలూకు స్క్రిప్టు వగైరాలుఅన్నీ పూర్తయినట్లు, ఈ నెలలో షూటింగ్ ప్రారంభం కానున్నట్లు తెలిసింది. ఈ చిత్రాన్ని కె. వి. రెడ్డిగారు డైరెక్టు చేస్తారు. కనుక ఇది కె. వి. గారిమొదటి సాంఘిక చిత్రం అవుతుంది.

* * *

సంగీతదర్శకుడు ఎస్. రాజేశ్వరరావు ప్రస్తుతం ప్రసాద్ గారి స్వంతచిత్రానికి, తార రాజకుమారి తీస్తున్న ఒక తమిళ చిత్రానికీ సంగీతం రచిస్తున్నాడు.

* * *

ఎ. వి. ఎమ్. ప్రొడక్షన్సువారు తమిళం, తెలుగు, హిందీలలో "గర్ల్" అనే చిత్రం తీస్తున్నారు. దీనికిరామన్ దర్శకుడు. నాగయ్య ప్రధాన భూమిక నిర్వహిస్తున్నారు.

* * *

28-5-52 సచిత్ర వారపత్రికలో "వెంజన్స్" చిత్రంలో గిరిజ, కాంతారావు నాయికానాయకులుగా నటిస్తున్నారని పొరపాటున పడినది. వీరు చెల్లెలు, అన్నగా నటిస్తున్నారు. ఈ చిత్రంలో రాజనాల ముఖ్యపాత్రలలో ఒకదానిని నిర్వహిస్తున్నాడు.

* * *

స్క్రిప్టు రచయితగా సినిమారంగంలోకి ప్రవేశించిన కె. ఎ. అబ్బాస్ ఇప్పుడు "అన్‌హోనీ" అనే చిత్రంసొంతంగా నిర్మిస్తూ, డైరెక్టు చేస్తున్నాడు. ఈ చిత్రం జులైలో విడుదల కావచ్చును. ఇందులో నర్గీస్, రాజ్ కపూర్, ఓంప్రకాశ్, ఆగా మొదలైనవారు నటిస్తున్నారు. నర్గిస్ రెండుపాత్రలు నిర్వ

చూస్తే అంతా ఒక కుటుంబంలో వారుగా మెలగుతున్నట్లు కనబడింది. అందులో నాగయ్యగారు ఆదరానికి, ఓపికకు పెట్టిందిపేరు. ప్రతినటినుండీ, నటునినుండి సాధ్యమైనంత ప్రతిభను వెలికి తీసుకురావాలని ఆయన ప్రయత్నిస్తున్నారు. ★



నేషనల్ ప్రొడక్షన్సువారి 'సింగారి' లో లలిత.

హిస్తున్నది. ఒకటి ధనికునికుమార్తె పాత్ర. మరొకటి ఆ ధనికునికి ఒక వేశ్యవలన కలిగిన కుమార్తె పాత్ర. ఈ రెండుపాత్రల సంఘర్షణే చిత్రంలో కథావస్తువు. ఒక పాత్రలో సౌజన్యాన్ని, మరొక పాత్రలో దుష్టత్వాన్ని నర్గీస్ చాల నిపుణంగా నటిస్తున్నదట.

*　　*　　*

అబ్బాస్ గతమాసం "ఆకాశ్" అనే మరొక చిత్రం మొదలుపెట్టాడు. దీనికి డైరెక్టరు మనోమోహన్, స్క్రిప్టురచయిత అబ్బాస్. నదీరా, బల్రాజ్ సానీ, సుమిత్రా, ఆగా మొదలైన వారు నటిస్తున్నారు. అనిల్ విశ్వాస్ సంగీతం రచిస్తున్నాడు.

*　　*　　*

బాంబేటాకీస్ కార్మికుల సంఘంవారు తమంతటతాము ఒక చిత్రం తీస్తున్నారట.

## సవరణ

ఈ సంచిక 15వ పేజీలో వెలువడిన పక్షిరాజావారి '**కాంచన**' ప్రకటనలో విడుదల కేంద్రము ఖమ్మంమెట్టుకు ఎదురుగా 'టాకీస్' అని ఉన్నది. 'సారథి టాకీస్' అని చదువుకొనవలెను. 'కాంచన'

**ఖమ్మంమెట్టు సారథి టాకీస్**

లో విడుదల అగుచున్నది.

ఈ చిత్రంలో డైరెక్టరు ఫణి మజుందార్, తారలు దిలీప్‌కుమార్, మధుబాల, దేవానంద్, షేక్‌ముక్తార్, తదితరులు, ఉచితంగా పనిచేస్తున్నారట. ★

## వ్యాఖ్యలు, విమర్శలు

(3-వ పేజీ తరువాయి)

చెయ్యవలసిన కృషి ఎన్నడూ తృప్తిగా కొనసాగలేదు. దేశంలో ప్రాథమిక విద్యా పాఠశాలలు బొత్తిగా చాలవు. ప్రచారం చేసి సర్వవర్గాలకూ చెందిన బాలబాలికలను ప్రాథమికవిద్యా పాఠశాలలకు పంపవలసిన బాధ్యతను లోకల్‌బోర్డులు నిర్వర్తించడంలేదు. నిర్బంధ ప్రాథమిక విద్యా విధానాన్ని ప్రవేశపెట్టే అవకాశం ఇంకా కనుచూపుమేరలోనైనా లేదు. ఈ పరిస్థితిలో లోకల్‌బోర్డులు తమతమ ఆదాయాలలో ఫలానివంతు అని ఒక కనీసప్రమాణాన్ని నిర్ణయించి ప్రాథమిక, మాధ్యమిక విద్యావ్యాప్తికీ గ్రంథాలయాల స్థాపనకీ తోడ్పడవలసినది పోయి ప్రభుత్వం తమ ఉద్యోగుల సౌకర్యం నిమిత్తం లోకల్‌బోర్డుల ఖర్చుభారాన్ని పెంచడం ఉచితంగా కనపడదు.





## వస్తూత్పత్తి

గతసంవత్సరంలోకంటె 1951-52 లో ముడిప్రత్తి, ముడినార, పంచదార అధికంగా ఉత్పత్తయినట్లు, భారతప్రభుత్వ ఆహార, వ్యవసాయశాఖల మంత్రివర్గం ప్రకటించింది. 1951 లో మొదటి నాలుగు మాసాలతో పోల్చినట్లయితే 19-2 లో మొదటి నాలుగుమాసాలలో పారిశ్రామిక వస్తూత్పత్తిలో పెరుగుదల కనపడుతున్నదని కేంద్రవాణిజ్య శాఖామంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు పార్లమెంట్‌లో తెలిపారు. వస్తువుల టోకు ధరల నిష్పత్తి ప్రమాణాల్ని (హోల్‌సేల్ ప్రైస్ ఇండెక్స్) ఆహారవస్తువుల ధరలు తగ్గినట్లు, వివిధనగరాలలో కార్మికుల జీవనావసర వ్యయ ప్రమాణాల్ని గమనించినట్లయితే అవి కూడా తగ్గినట్లు తేలుతున్నదని కేంద్ర ఆర్థిక శాఖామంత్రి శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ గారు పార్లమెంట్‌లో ప్రకటించారు. వివిధ ప్రాంతాలలో కరువు పరిస్థితులనుగురించి ప్రస్తావిస్తూ ఇదివరలో ఆహార శాఖామంత్రి కిద్వాయ్‌గారు ప్రజల కొనుగోలు శక్తి తగ్గినందువల్ల దుర్భిక్షం కనపడుతోందన్నారు.

## గుణకారాల గుణం:

ఇవన్నీ వింటే నిజంగా మనదేశం ఏపరిస్థితిలో ఉందో అర్థం చేసుకోవడం దుర్ఘటమైపోతోంది. అంటే ఆర్థికంగా మనదేశం బాగుపడుతోందో లేక ఇంకా కుంగిపోతోందో పై వివరాల్నిబట్టి ఊహించడం అసాధ్యం. ఎలా అనుకుంటే అలా సరిపెట్టుకోడానికి వీలుగా ఉన్నాయి లెక్కలన్నీ.

లెక్కలమాట దేవుడెరుగునని సరిపెట్టుకోడానికి వీలులేని పరిస్థితివచ్చింది. ఏ పార్టీని చూసినా లెక్కల్తో మొదలెట్టి ప్రత్యర్థి పార్టీల్ని తిట్టడమో లేక లెక్కల్తోనే ఆత్మస్తుతి చేసుకోడమో కనపడుతుంది. (డా॥ పట్టాభిగారి ఇష్టాగోష్ఠి మాదిరిగా) శాసనసభల్లోనూ బహిరంగసభల్లోనూకూడా కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్ పార్టీ ఇతర పార్టీలు లెక్కల్ని ప్రయోగించి పోరాటం సాగిస్తున్నారు.

నిత్యానుభవాన్ని పరిశీలించుకుంటే కొనుగోలుదారుల అవసరవ్యయ ప్రమాణం పెరగడమే కాని తగ్గడం ఎక్కడా కనపడదు. ఇచ్చేడబ్బుకి వస్తువు కుదించుకుపోడమే గాని ముఖం వికసించటం కనపడదు. ఖర్చు అధికమౌతుండగా ధరలు తగ్గాయనీ జీవనవ్యయ ప్రమాణం తగ్గిందనీ ఎవరైనా అంటే వినేవారికి సహనం క్షీణి

స్తోంది. ఇది చాలదన్నట్లు ఈమధ్య పత్రికల్లో కొన్ని వార్తలు చూస్తుంటే కోపానికి కోపం, నిస్సహాయతా అధికమౌతున్నాయి. మచ్చుకి ఈవార్త చూడవచ్చు.

బొంబాయి జూన్ 2: కచ్చా వెండి మార్కెట్‌లోకి దండిగా (దాదాపు 40 బార్‌లని అంచనా) వచ్చినప్పటికీ, ఈ పూట బులియన్ మార్కెట్ కొంచెం హుషారుగానే వుంది. దీనికి కారణం ఏం చెప్తున్నారంటే కొరియన్ శాంతి రాయబారాలను గురించి ఐక్యరాజ్యసమితి కార్యదర్శి గారు పెదవి విరిచేసినందువల్లనూ, మరణసుంకాల శాసనాన్ని ఇహ పాస్‌చేసెయ్యవచ్చునని గాడ్గిల్ గారు నివేదించినందువల్లనూ స్పెక్యులేషన్‌దార్లు కొనుబడిని జోరుచేశారట.

వర్తకులకి హుషారైతే వాడకపుదార్లకి ప్రాణసంకటం. ★



# రిక్షావాడు

(5-వ పేజీ తరువాయి)

యలు వస్తాయో, రావో, వచ్చినా ఇప్పుడు ఏ అర్ధరూపాయో ఫైన్‌కింద పోతుంది. ఇందులో తనేం తింటాడు, ఆ రోగిష్టి పెళ్ళానికి ఏం పెడతాడు? నా కివాళ వచ్చిన చెక్‌కి నేను తగుదునా అనిపించింది. నేనేం కష్టపడ్డానని ఆ డబ్బు తీసుకోవాలి? ఆ డబ్బుమీద నాకేం హక్కులేదనిపించింది. నిజంగా నేను ఆ డబ్బు తీసుకుంటే దుర్వినియోగం అవుతుంది. ఆ చెక్కు వాడి కిచ్చేద్దామా అనిపించింది. హేండ్ బాగ్‌లోకి చెయ్యిపోనిచ్చాను. కాని ఏదో నాకు తెలియని నాలోని ఒక శక్తి నన్నా పని చెయ్యనియ్యలేదు. అదే సమయానికి ఈ పదిహేను రూపాయలు పెట్టి నేను కొనుక్కుందామనుకొన్న నినాన్ సిల్కుచీర జ్ఞాపకం వచ్చింది. నా క్లాస్‌మేట్ రమ, నిన్ననే ఆ చీర కట్టుకొని కాలేజీకి వచ్చింది. ఆ లేతపసుపు పచ్చని రంగుమీద సన్నని వైలెట్‌రంగు నన్నెక్కువగా ఆకర్షించింది. ఆ చీర మెరుపు నా హృదయంలో ఒకసారి తళుక్కుమంది. నా భావాలు మారిపోయాయి. పట్టి చెయ్యినే బైటికి తీశాను. పోనిద్దూ, ఇప్పుడు ఈ 15 రూపాయలు వాడి కిచ్చినంత మాత్రాన వాడి దరిద్రం ఎలాగూ తీరిపోదు. అయినా మనం ఒక్కరికి సాయం చెయ్యటంతో ఏమైంది? దేశమంతా ఇలాగే తగులడుతోంది. దీనికి గవర్నమెంటే పూనుకోవాలిగాని మనవల్ల ఏమౌతుంది? ఒకళ్ళా ఇద్దరా? ఎంతమందికని సాయం చెయ్యటం? నేను ఈ ఒక్కడికి సాయంచేసినంత మాత్రాన దేశం బాగుపడదు. అందరూ, అందరికీ సాయం చెయ్యాలి. అలా ఒక్కనాటికీ చెయ్యరు. ఇక నా ఒక్కదానివల్లా ఏమవుతుంది, అనవసరంగా నేను నష్టపడటం తప్ప విడిస్తే. ఇలాంటి భావాలు నాలో దొర్లసాగాయి.

బస్ స్టాప్ వచ్చేసింది. నేను రిక్షా దిగి బాగ్‌లోంచి ఒక పావలా తీసి వాడి చేతిలో పెట్టాను. "అమ్మగోరూ, మునిలోన్ని, ఎంతలో కట్టపడ్డాను." అన్నాడు ఇంకా చెయ్యి జాపి. ఇంకొక అణా తీసి వాడి చేతిలో పెట్టి, నా దాతృత్వానికి నన్ను నేనే మెచ్చుకుంటూ వచ్చేశాను. ★

## రచయితలకు మనవి

రచయితలు తమ రచనలను సిరాతో కాగితానికి ఒకే వైపున వ్రాసి పంపవలెనని మనవి. తమ రచనలను త్రిప్పి పంప గోరువారు, మూడు కాన్ల స్టాంపులను రచనలతోనే చేర్చి పంపవలెనని కోరుతున్నాము. అలా స్టాంపులను రచనలతో చేర్చి పంపనిచో త్రిప్పిపంపుట సాధ్యముకాదు.

కొంతమంది తమ రచనలను ఏ కారణములవల్ల ప్రచురించలేదో ప్రశ్నిస్తూ లేఖలు వ్రాస్తున్నారు. అట్టి కారణాలను వివరించుట సాధ్యముకాదని రచయితలు గుర్తింపవలెనని ప్రార్థిస్తున్నాము.

—సంపాదకుడు.

## విజ్ఞాన వీధులు

(30-వ పేజీ తరువాయి)

వాయువుని (ఆక్సిజన్ని,) కృత్రిమ విధానాల వల్ల విరివిగా దేహంలోకి పంపించి కాపాడ గలుగుతారు. కొంచెం శ్రద్ధవహించి దుష్టులకి దూరంగా ఉండాలన్నట్లు దీప్తాంగార వాయువుని దరిజేర నియ్యకుండా ఉంటే సరి. గోటితో పోయే దానికి గొడ్డలి అవసరం ఉండదు.

కాలీ కాలని బొగ్గు నిప్పూ, చిన్నకొట్లలో చమురు దీపమూ, గ్యాసు నప్లయివున్న గదుల్లో గ్యాసు బిరడా బాగా బిగించడానికి బద్ధకమూ, "ప్రాయోకాలం వచ్చిన వాడు దీప నిర్వాణ గంధపు వాసన పట్టలేడ"న్న చిన్నయసూరి వాక్యాన్ని నమ్మి దీప నిర్వాణ గంధాన్ని పలుమారు వాసన చూడగలమా లేమా అని పరీక్ష చేసే ప్రాయోకాలమూ లేకపోతే దీప్తాంగార వాయువునించి తప్పించుకోవచ్చు. (హరి)

## చదరంగం

(16-వ పేజీ తరువాయి)

రామా: శాస్త్రిగారూ! మీరు చాలా చదువుకున్నవారు. ఇంత కోపమైతే ఎల్లాగండీ చెప్పేదానికి, చేసేదానికీ ఏమీ సంబంధం లేదా యేమిటీ? అంత తొందరా? నేనన్న మాటేమిటీ, దాని కర్థ మేమిటీ, మీ కోపమేమిటి?

వెంక: నన్ను "ఖిల్లాడీ" అన్నావా లేదా? ఆ మాటకే నా కర్థం తెలియదనుకున్నావా? వెధవ హిందీముక్కలు రెండు నేర్చుకున్నాం కదా అని అంత విర్రవీగా? పెద్దా పిన్నా తారతమ్యం లేకుండా.

రామా: శాస్త్రిగారూ! నేను చెప్పే మాట వినాలి. హిందీలో "ఖిలాడీ" అంటే మంచి ఆటకాడు అని అర్థం. మీరు మంచి ఎత్తులు వేయుచున్నారని ఆమోదముగా అంటే మీరు యిలా తొందరపడి దుర్భాషలాడవచ్చునా?

వెంకట: నాకేం ఆమాత్రం తెలుసునయ్యా, ఖిల్లాడీ అంటే అర్థ మేమిటో. అధిక ప్రసంగం చెయ్యక ఎత్తు వెయ్యి.

నారా: ఆ ఏనుగులు రెంటిమధ్య వున్న బంటుని ఎగసాందోయి.

రామా: (ఆలోచించి) నిజమే "ఉద్ధతుల మధ్య బీదలకుండ తరమే" అన్నాడు కవి. (అని బంటును తోయును.)

గవరయ్య (వెంకటశాస్త్రి చెవిలో) వాళ్ల బలంమీద కొచ్చేస్తోంది. జాగ్రత్తండోయి.

వెంకట: (కంగారు పుట్టి) యీ వెధవ బల్లమీద గీతలు సరిగా కనపడ్డమే లేదు. ఏమే! కళ్ళజోడిల్లా పట్టుకురా.

రామా: అదేమిటండీ. కళ్ళజోడు మీ కళ్ళనే వుంది గాదండీ.

వెంకటశాస్త్రి: (ముక్కుమీద దిగజారి వున్న కళ్ళజోడును దగ్గరగాత్రోసి కంగారుగా బంటును ముందుకుజరిపి) ఏమండోయి పొరబాటు. (అని వెనకకు లాగివేయును.)

రామా: శాస్త్రిగారూ! ఇందాకా నన్ను "జంతువుమీద చెయ్యివేసిన తరువాత జరిపి తీరవలసిందే" అని శాసించారే, మీరు మళ్లీ వెనక్కి లాక్కొవచ్చా?

వెంక: అయ్యో! యీ మాత్రానికే.

రామా: పోనీవయ్యా. తీసుకో, ఇంతలోకి మించిపోయింది లేదు.

నారా: (రామారావుతో) ఆ గుఱ్ఱాన్నెసి రాజనవోయి.

వెంకట: ఆ దేవాళ్ళకంటె పైవాళ్ల గొడవెక్కువగావుందే! [రామారావు గుఱ్ఱాన్ని వేసి రాజనును. వెంకటశాస్త్రి చెయివణుకుతూ రాజును ప్రక్కగదిలోక జరుపును.]

రామా: (మంత్రిని జరిపి) ఇదో రాజు.

వెంక: [రాజును పైకి జరుపును]

రామా: (బంటునుత్రోసి) తోసిరాజు ఆటకట్టు.

వెంక: (కంగారుగా) ఆ. ఆ. ఆటకట్టే!

నారా: ఇంక గతేది రాజుకి?

వెంక: (కొంచెం ఆలోచించి) ఇలాంటి వెధవాటలాడకూడదు యీగాయి వాళ్లతోటి. ఏకగొడవ వాగుడూను, మంచీ చెడ లేకుండా.

రామా: ఏమండోయి శాస్త్రిగారూ, ఇందులో పోయిందేమున్నదండీ స్పోర్ట్సుమన్ (*Sportsman*) గా వుండాలిగాని ఉడుకుమోతుతనం...

వెంక: మళ్లీ పేలుతున్నావూ? ఇందాకా "ఖిల్లాడి" అన్నావూ, ఇప్పుడు "స్పోర్ట్సుమన్" గీర్సుమన్నావా? పైగా నేను ఉడుకుమోతునా? ఫో. ఫో.

రామా: శాస్త్రిగారూ, క్షమించాలి. మీవంటి పండితులే యింత ఆగ్రహపడితే పామరులమాటేమిటి? కలిసిరాని, చతురంగపాటలో అబద్ధాలు, అహంకారాలు ఎందుకండీ? కలిసొచ్చేచోట ప్రజాసామాన్యం అబద్ధాలు, అప్రమాణికాలు చేస్తే వారిని ఖండిస్తూ నీతులు చెబుతారా మళ్లీ?

వెంకటశాస్త్రి: ఓహో! "ఈ పాండిత్యము నీకు దక్క మరి యెందే గంటిమే?"

రామా: ఆహా శాస్త్రిగారు *Poeticvein* లో పడ్డారే. ఇల్లాంటి వాళ్ళని *Reform* చెయడానికి శ్రీ మహావిష్ణువుమరో అవతారమెత్తాలి. (అని అగుగు దిగివెళ్లును.)

వెంక: అబ్బాయి' మాటలుమాత్రం తిన్నగా రానీయి. జాగ్రత్త. ఎవరనుకునావో. ★



Edited, Printed&Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras.



ప సి పి ట్ట లు

—చిత్రకారుడు శ్రీ లావణ్యారామన్, ఆరకోణం.

Regd. No. M. 4479.




నేడే చూడండి!

# ధర్మదేవత

రాగిణి చిత్రం..

శాంతకుమారి.. లలిత. గిరిజ.. లింగమూర్తి
ముక్కామల.. కౌశిక్.. రేలంగి.. బి.యన్.ఆర్.. రామ్మూర్తి

రాజశ్రీ రిలీజ్

కథ... కె.వి.రెడ్డి, B.Sc.(HONS). గోపీచంద్... చెంగయ్య... లింగమూర్తి... బి.యన్.ఆర్.

డైరెక్టర్.. పి.పుల్లయ్య బి.ఎ.

మాటలు గోపీచంద్ * పాటలు సముద్రాల & కె.జి.శర్మ * సంగీతం సుబ్బరామన్ * కళ ఎస్.వి.ఎస్ * ఫొటోగ్రఫి మాధవ బుల్‌బులె * సౌండ్ ఎ. కృష్ణన్..